# తొలిపలుకు

మిత్రులు శ్రీ ముద్దా విశ్వనాథంగారు రచయితగా చిరకాలంగా ఆంధ్ర పాఠకలోకంలో సుప్రతిష్ఠితులు. వీరి రచన 'ఛాయ' అను నాటికల సంపుటిని ఆంధ్రమహాజనుల కందిచ్చు అవకాశం లభించినందుకు సంతోషము.

ఇందులో పది నాటికలున్నవి. చాలవరకు రేడియోవారిచే ప్రసారితములే· అన్నీ పత్రికలలో ప్రచురితములే. వీటిలో కొన్ని మాత్రం గ్రంథరూపంలో వెలువడినవి. ఇప్పుడు అన్నిటినీ ఒకే సంపుటిగా ప్రచురించుచున్నాము.

కేవలం శ్రవ్యములుగానేగాక దృశ్యయోగ్యములు కూడను యివి. తినబోతూ రుచులేల! చదవండి, మీకే తెలుస్తుంది. సెలవు.

రాజమండ్రి
1-8-1956

మహీధర జగన్మోహన్‌రావు,
సంపాదకుడు.



ఇందలి నాటికలు కొన్ని 1940 లో మొదటిసారి ప్రకటితమైనవి. అప్పుడు వీటినిగురించి పత్రికలు తెల్పిన అభిప్రాయములు.

"ఈ నాటికలలోని సంభాషణలు చదువుతుంటే షేక్స్పియరు నాటకములలోని జూలియస్ సీజర్, హామ్లెట్ సంభాషణలు స్మృతిపథంలోకి వస్తున్నవి. కథలు చాలా పొంకంగా ఉన్నవి. భాష చక్కని వ్యావహారికము. సంభాషణలు ఎంతో రుచిగా ఉన్నవి."

—భారతి (మే, 1941.)

*　　*　　*

" సుఖంగా చదువుకోటానికి చాలా ఆనందం కలుగచేస్తవి. ఈ నాటికలను ప్రతి ఆంధ్రుడూ చదివితీరాలి. విశ్వనాథంగారి కలం ఆంధ్రులకు చిరపరిచితమైందే. నాటికలు వ్రాసిన తీరులో మాత్రం కొత్తదనం చూపించారు."

—ఆంధ్రజ్యోతి ( 23–2–41 )

*   *   *

" లైట్ మూడ్‌లో ప్రదర్శనయోగ్యంగా, హృదయరంజకంగా వున్నాయి. టెక్నిక్ నవీన పద్ధతులమీద నడిచింది."

—కల్యాణి

*   *   *

" ఈ నాటికలు ప్రపంచాన్నంతటినీ చుట్టబెట్టివచ్చాయి, ఇదివరకే A.I.R. ద్వారా. విశ్వనాథంగారి నాటిక వుంటుందేమో అని A.I.R. కార్యక్రమం చూడని రోజులేదు. అచ్చులో ఈ నాటికలు లేక పోవడం తెలుగుతల్లికి పెద్దలోపం అనిపించింది."

—తెలుగుతల్లి ( 19-3-41 )

*   *   *

"The plays are well - written and are welcome as light reading."

—The HINDU (1-2-42)

*   *   *

" ముద్దులొలిక్కే భాష, మృదుల భావాలు ద్యోతకమౌతున్నాయి"

—వాహిని (13-4-41)

*   *   *

" ఈ నాటికలలో ఒకటికి మించిన దొకటి. చక్కని శైలి. మొదటి నుంచి తుదివరకు చదివినగాని పుస్తకము విడుచుటకు బుద్ధి పుట్టదు."

— భారతీయవైశ్య (మార్చి, 1941)

# పాత్రలు

| | | |
|---|---|---|
| ధర్మారావు | ఇంటి యజమాని | |
| రామకృష్ణయ్య | వారింట్లో కాపురమున్నాయన | |
| భానుమూర్తి | రామకృష్ణయ్యగారి పెద్దకొడుకు | |
| లలితాంబ | ,, | భార్య |
| చిట్టి } రుక్మిణి } | ,, | కూతుళ్ళు |
| ఛాయ | ,, | పెంపుడుపిల్ల |

---

*మద్రాసుకేంద్రమునుండి ప్రసారితం :* **10–4–40**

# ఛాయ

## (అదీ వొక మంచికే)

వీధివెంపు వసారాలో లలితాంబ రాట్నం వడుకుతూ వుంటుంది. గదిలో ఛాయ చిన్నపిల్లలిద్దరికీ చదువు చెబుతూ, బట్టలు కుట్టుతూ వుంటుంది. చిట్టమ్మ — రుక్మిణీ చిక్కుడు కాయలూ, అరటి పువ్వులూ వొలుస్తూంటారు.

ఛాయ :— శుక్రవారమూ...

పిల్లలు :— శుక్రవారమూ...

ఛాయ :— శనివారమూ...

పిల్లలు :— శనివారమూ

ఛాయ :— ఈ యేడున్నూ...

పిల్లలు :— ఈ యేడున్నూ

ఛాయ :— వారాల పేర్లూ—

పిల్లలు :— వారాల పేర్లూ—

చిట్టమ్మ, రుక్మిణి :— (చక్కిలాలు నములుతూ, పువ్వులు వలుస్తూ)—

"మా కీ కర్మము
తప్పదిదేలా !.... "

ఛాయ :— ఏమిటే చెల్లాయ్! మళ్ళీ పాడూ... అమ్మమ్మ గారూ!— మన చిట్టీ, రుక్మిణీ ఎంతచక్కటి పాట పాడుతున్నారో విన్నారా?

లలిత :— ఏవిటదీ ? ...

ఛాయ :- పువ్వు లోలుస్తూ, "మాకీ కర్మము తప్ప దిదేలా ?" అంటూ యెంతో స్పష్టుగా పాడుతున్నాను!

లలిత :- అసె పెంకి రాలుగాయా! ఒక్కమాటు వింటేచాలు, ఇట్టే అందిపుచ్చుకుంటుంది చిట్టి. చిట్టికొచ్చినపాటల్లా రుక్మిణికి వచ్చేసిందన్నమాట ! ఆవిడిగారి శిష్యురాలేగా, మరీ! అయినా, సుబ్రహ్మణ్యంగారి ముక్కలు సరిగ్గా సమయానికే జ్ఞాపకం రావటంలేదూ.

[ వీధిలో ధర్మారావు ]

"రామకృష్ణయ్యగారూ !—"

ఛాయ :- ఎవరంటే వారు ?— ( తలుపు తీస్తుంది. )

ధర్మారావు :- కృష్ణయ్యగా రున్నారా అమ్మా !-

[ ఇంతలో లలితాంబ వచ్చి ]

లలితాంబ:- ఓహో, అన్నయ్యగారా! యెప్పుడూ రావటం. పోయిన మాఘంలో కాబోలు మీ రొచ్చింది. మళ్ళా అప్పటి కిప్పుడూ. పోనీలెండి, ఈనాటికైనా కళ్ళబడ్డారు? అదే పదివేలు. వదినగారూ పిల్లలూ ఖులాసాగా వున్నారాండీ ?

ధర్మారావు :- ఆఁ. దేవుడి దయవల్ల ఖులాసాగానే కాల క్షేపం వెళ్ళిపోతూంది. మనవాళ్ళంతా క్షేమమేనా?

లలిత :- క్షేమంగానే ఉన్నామండి, ఈ ఘడియ వరకూ. అయ్యో...నించుండిపోయ్యారే...చిట్టీ!- మడతకుర్చీ ఇలా వెయ్యమ్మా మామయ్యగారికి.

[చిట్టి కుర్చీ తెచ్చి వేస్తుంది. ఆయన స్థిమితంగా కూచుంటారు.]

ధర్మారావు :— ఆ మధ్య నేదో కో-ఆపరేటివు వ్యవహారంలో బావగారు జామీ నున్నారనీ, అప్పుచ్చుకు న్నతను దగా చేశాడనీ విన్నాను. అవన్నీ...

లలిత :— ఆ చిక్కులన్నీ మొన్న నే తెరిపయిపోయినాయండి, అన్నయ్యగారూ, మీ ఆశీర్వాచనంవల్ల. ఇప్పటికి కష్టాలు గట్టెక్కినట్టే. ఏం చేస్తాం, మన చేతులో యేమీ్మా లేదు. మంచి కెళ్ళినా, రోజులు బాగుండ నప్పుడు చెప్పకుండానే చెడ్డ ఎదురొస్తుంది. అయినా, మన పరమార్థం యెక్కడికి పోతుందీ !—

ధర్మారావు :— పరమార్థానికేం ? ముందు మనం అవస్థ పడటం తప్పదుకద,— యేమిటో లెండి. మీ రన్నట్టు, ఇవన్నీ విధికృతాలు. అంతేగానీ, కావాలని కోరి తెచ్చుకుంటామా ? బావగారు పొలం వెళ్ళినట్టుందీ ?

లలిత :— అవునండి. నూర్పులు మొదలెట్టామా, ఈ నాలుగు రోజులూ మెతుకులుకూడా సరిగ్గా నోట్లో వేసుకోరు. పెద్దాడూ రెండోవాడూ పొలంలోనే కాపరం పెట్టేసి, బొత్తిగా ఇంటిమొహం చూడ్డమే మానేశారు.

ధర్మారావు :— ( పిల్లలందరి వంకా చూసి ) లలితాంబ గారూ!— మీ యెదటనడం కాదుగానీ, మీ పిల్లల్ని చూస్తే —— నాకు ముచ్చటేస్తుందండి. ఒక్కళ్ళకూ చెయి వూరుకోదుకదా ! ఓశోశ్, బొమ్మేస్తాడని ఆ

అమ్మాయిలకూడా అప్పుడే తాపత్రయమే! ఇదు గిదుగో - ఈ చంటిపాప మరీనీ - ఎంత చురుకు? - సిసింద్రీ లాగ...

లలిత :— అలా అంటా రేమిటం డన్నయ్యా!- మన యింటి పని మనమే చూసుకోకపోతే పై వాళ్లెవళ్ళొస్తారూ! అయినా, వాళ్ళూ వాళ్ళూ చేస్తే యేమంత సుష్టు పడుతోంది. మా పెద్ద కుర్రాళ్లిద్దరికీ సంసారం మోసింది, ఫరవాలేదు. అందరికంటె యెక్కువగా నాబాంధో అని పాటుపడతారు....చిన్నే కాదు, పెద్దే కాదు ... వాళ్ళు దాచుకుంటేమటుకి వొప్పరండీ, మీ బావగారు.

శర్మారావు: — భావగారి సంగతి చెప్పక్కర్లేదు. మీకంటే నాకు బాగా తెలుసు. ఇప్పుడా? పుట్టి బుద్ధెరిగి, పాతి కేళ్ళనించి చూస్తూన్నా ఆయనగారి పట్టుదలా, వ్యవ హారమున్ను.

పోనీగానీ- మీ పెద్దవాడు భానుమూర్తికి మరి, ఎన్ని ఛాన్సులు వచ్చి పోయ్యాయి చెప్పండి. బొందిలో ప్రాణాలుండగా నవుకరీ చేయనిస్తానా అని చెప్పి, యెక్కడికక్కడికే విసిరికొట్టేశారు కాదూ? లేకపోతే, నిక్షేపంలాగ ఈపాటికి...

చిట్టెమ్మ :—మా నాన్న మంచివాడు కాదు. కొత్తనాన్ననీ కొని తెచ్చుకోండి.

[ అని అనేసి, గిరుక్కున వెళ్ళిపోతుంది. ]

లలిత :— ఆసి, నీ కడుపుడకా!—(ధర్మారావుగారి వైపుతిరిగి) చూశారా అన్నయ్యా! వాళ్ళ నాన్నగారిమీద యీగని వాలనివ్వదండి, మా చిట్టితల్లి. అంత అభిమానం దానికి.

ధర్మారావు :— అలాగటండీ, చెప్పారు కారూ! చిట్టమ్మ నాన్నగారి పార్టీయా? — సరే, బోధపడిం దిప్పుడు.

(నవ్వుతుంటారు)

లలిత :— ఎలాగైనా ఈ కాలపు కుర్రాళ్లకింక భయభక్తులు రావండి. అందులోనూ చిట్టి — ఎంతకొస్తే అంతా అనేస్తుంది. మహాచెడ్డ మనసు. ఎలా బ్రతుకుతుందో ఏమోకానీ.

ధర్మారావు :— యేమంటావోయ్, అలా అనొద్దు. ఆమాత్రం ధైర్యం ఉండాల్సిందే.

లలిత :— మీ మాట కడ్డొచ్చాననూ; భానుకి ఉద్యోగం కాలే దని నా కెప్పుడూ విచారం లేదండన్నయ్యా. ఏదో, జన్మెత్తినందుకు — కళ్ళు వెలుగ్గా నలుగురం ఒద్దిగ్గా పడివున్నాం. అంతకంటే యేం కావాలి! అయినా, యేం ఉద్యోగాలు పోనిద్దురూ.

కంచెర్లవారి రెండో కుర్రాడు — ఎరుగుదురుగా! మా భానుతోటివాడు—మొన్ననే పెళ్ళయింది కూడాను. లేక లేక కలిగాడూ — ఒక్కగా నొక్క కొడుకూ — అని చెప్పి సీమకుకూడా పంపారు వాళ్ళవాళ్లు. పెద్ద

పెద్ద పరీక్ష లిచ్చొచ్చాడు. అదేదోనమ్మా — పేరు నోట పలకదు ... వెవసాయం పరీక్షలో పేసయి బ్రహ్మాండం తలకిందు లయ్యేట్టుగా సర్టిఫికెట్లు చేత పట్టు కొచ్చాడు. ఇంటికొచ్చి ఆర్నెల్లయింది. రోజూ ఎక్కే గుమ్మం, దిగే గుమ్మమున్ను. ఇప్పటికింకా నలుపూ తెలుపూ కనపడదు.

సిగ్గుపడుతూ మా వాడి దగ్గిరకొచ్చి: "ఒరే భానూ! నీ పనే బాగుందిరా" అంటూవుంటాడు, పాపం!

మరివచ్చి — పక్కవీధిలో గురజావారి అబ్బాయి— మేష్టరీలో ప్రవేశించి పదిహేనేళ్లయింది. ఆయనగారి కెప్పుడూ బోర్డు ప్రెసిడెంటుగారితో రండా గొండీలే. ఆ వుద్యోగానికి మరి, గొర్రెతోకలాగ ఎదుగూ లేదు, బొదుగూ లేదు. కుటుంబం పెరిగిపోతూంది గాని, జీతంమటుకి పెరగటంలేదు. ఎన్నాళ్లు లెక్కేట్టేనా, ఆ కడిగేసిన పాతికరాళ్లే. మనకళ్లతో మనం ఇలాటి వెన్ని చూస్తున్నాం కామూ!

ధర్మారావు :— నిజమేలెండి. కాలమానం బొత్తిగా బాగు లేదు. అయినా, ఈ చదువులు చదివేవాళ్లు యేటా లక్షలూ కోట్లూ ఈనేస్తూవుంటే, యెక్కణ్నించి వచ్చి పడతాయీ వుద్యోగాలూ! మొత్తానికి నాకుతోచిన మాట ఒక్కటుంది. ఒళ్లువంచి పాటుపడేవాళ్లకి యెక్క

డున్నా లోటుండదు. అడివిలో కెళ్ళినా, అన్నం పుడు తుంది. ఏమంటారు ?

లలిత :— ఏదో, అన్నయ్యగారూ ! అంతా వాడి కృప. కడుపులో చల్ల కదలకుండా, మీ దయవల్ల కులాసా గానే గడిచిపోతూంది. ఇంతకీ, మీవంటివారి స్నేహం దొరకటం నిజంగా మేం చేసుకున్న పుణ్యం. మీ బావ గారూ ఇదేమాట అంటూవుంటారు అస్తమానమున్నూ.

ధర్మారావు :— అదేమిటో గానీ - ఈ స్నేహాలూ, బాంధ వ్యాలూ కలవడం విడిపోవడం అదంతా నో చిత్రమే సుమండి అక్కయ్యగారూ ! భగవంతుడి లీలలు మన కర్థంకావు.

ఏది - ఇలా రండి అమ్మాయ్ ! - ఇదుగో తా యిల్లం!!-అలిగి వెళ్ళిపోయింది గనక చిట్టెమ్మకి రెండూ. జాగ్రత్తగా పట్టికెళ్ళి యిచ్చెయ్యండి.

[ అందరకూ మిఠాయుండలు పంచిపెడతాడు.
ఒక్కొక్కళ్ళే వరసని వచ్చి అందుకుంటారు. ]

లలిత :— ఏమర్రా, ఆకతాయి పిల్లలూ ! పుచ్చుకుని వూరు కోవడమే కాదూ మర్యాదా ?

రుక్మిణి :— థాంక్స్. మీరు చాలా మంచివారండి ! (దణ్ణం పెడుతుంది. )

ధర్మారావు :— (ఛాయ వేపు చూసి, అట్టే ఆలోచనలో పడి ) అన్నట్టు - అక్కయ్యగారూ ! మీ చిట్టే పెద్దపిల్లను

కుంటున్నాను, ఇన్నాళ్లనించీన్నీ. నేను నిరు డొచ్చి నప్పుడు ఈ అ-మ్మా-యి...

లలిత :— (నెమ్మదిగా) చిట్టేనండీ, పెద్దది. ఈ అమ్మాయి మాకు కడుపున పుట్టలేదుగాని, కన్నకూతురు కంటె యెక్కువగా వుంటూంది.

ధర్మారావు :— ఓహో! బంధువుల పిల్ల కాబోలు.

లలిత :— కాదు లెండి.

ధర్మారావు :— మరి ?

లలిత :— అమ్మా, ఛాయా! వేళయింది, వెళ్ళి దూడని విడిచిరా.

[ ఛాయ వెళ్తుంది. ]

ధర్మారావు :— ఆ పిల్ల ఎంత నెమ్మది, ఎంత వినయం!

లలిత :— ఈ అమ్మాయిది - మన జిల్లా కాదు, మన కోస్తా కాదు. వినదలిస్తేరంటే అదంతా ఓ భారతమంత కథ వుంది.

ధర్మారావు :— విన-దలచడ మేమిటీ, తప్పకుండా చెప్పాలి. చాలా చిత్రమైన సంగతి చెవిని వేశా రివేళ. ముందు- కాస్తంత దాహానికి తెప్పించండీ.

లలిత:— హాయ్యో, నా మందమతి. క్షమించాలన్నయ్యగారూ! ...రుక్మా! పొద్దుట గిలకొట్టిన మజ్జిగ పెద సత్తు గిన్నెలో వుంది. వెండిగళాసులోపోసి పట్రా, చప్పున.

[ రుక్మిణి వెళుతుంది. ]

లలిత :- పోయిన సంవత్సరాది పాడ్యమినాడే - నాకు బాగా జ్ఞాపకం- పొద్దు గుంకిందీ. మీ బావగారు, పెద్దవాడు పొలంనించి వస్తున్నారు. మునిసీబుగారు ఇటికాంఁవకోసం మన్ను తవ్వించారు. చూడండి-వచ్చివచ్చి ఓ నాటు బండి ఆ గోతులో పడ్డది. మనవారు చూసి కేక వేసేసరి కల్లా రైతులు నలుగురూ పోగడ్డారు. ఒక్క దెబ్బని బండి సరిజేసారు. ఆ బండికింద ఒక ముసలమ్మానూ, ఆవిడపక్కనే ఈ పిల్లానూ కనిపించారు.

...ఈ ఛాయ—పూరుకోమని యెంత చెప్పినా - యెవళ్ళం చెప్పినా - ఊహుఁ — ఒకటే యేడుపు. ముసిలమ్మకి వొళ్ళంతా హూనమయిపోయింది. ఆ బండీలోనే మళ్ళీ నిమ్మళంగా పడుకోబెట్టి - ఆవిణ్ణింటికి తీసుకొచ్చారు మావారు...

తీరా తీసుకువచ్చాము-ఎలా మాటదక్కుతుందా భగవంతుడా అని చెప్పి వెయ్యి దేముళ్ళకి మొక్కామంటే నమ్మండి, అన్నయ్యా! దైవముఖం చూసి చెయ్యగల ఉపచారాలన్నీ చేశాం.

ధర్మారావు :- ఎంతపని, ఎంతపని! ఆఁ - తరవాత?

లలిత :- ఈ పిల్లని ఓదార్చడం మా చెడ్డకష్టమై పోయిందండి.

ధర్మారావు :- కాదటండీ, పాపం!

లలిత:- అసలే కాలం మళ్ళిపోయింది. అదీగాక నెత్తిమీద పెద్ద గాయాలు తగిలాయి. ఎన్ని తంటాలుపడ్డా ముసి

లమ్మ స్థితి రోజురోజుకీ దిగనాసిల్లిందే గాని, మెరుగిచ్చింది కాదు...

అక్కడికీ మీ బావంటే సర్జన్‌గారికి ప్రాణం కావడంచేత రెండుపూటలా 'నర్సు'ని పంపి భోగట్టా కనుక్కుంటూనే వుండేవారు. నాగా లేకుండా కట్లూ కట్టారు. ఏంజేస్తేమాత్రం ఆయువు పొయ్యడం మనవల్లవుతుందా!

పట్టిన మంచం విడవకుండా, నాలుగు వారాలు తీసుకునేటప్పటికి, ఇహ మన వస్తువ కాదుగదా అని నిశ్చయించుకున్నాం.

...కాదుగానండి, అన్నయ్యగారూ!– ఈ ఛాయ ఒక్క నిమిషమైనా నాయనమ్మని విడిచిపెట్టలేదండీ. రాత్రీ పగలూ రెప్పవాల్చకుండా ఒళ్ళోలాగ కనిపెట్టుకుని వుండేది. పడరానిపాట్లు పడ్డది, పాపం!...

"నా య న మ్మ కూ డా పోతే, నా గ తేమిటి దేముడా!" అనిచెప్పి కంటికీ మంటికీ ఏకధారగా యేడిచిపోయిందండీ, కుర్రది...

తలిదండ్రులు లేరుట, తూర్పున యెవరో తండ్రివంక బంధువు లున్నారుట. వాళ్ళయినా చేరదీస్తారేమోనని ఆశపడి, ఈ అమ్మాయీ ముసిలమ్మా బయల్దేరారుట. వాళ్ళొకటి తలిస్తే దైవమొకటి తలిచాడు! అంతలో ఇంత జరిగింది.

ధర్మారావు:— సరి, సరీ.

లలిత:— గొడవంతా యెందుకు గానండీ - మరో వారం పది రోజులు తిరిగేసరికల్లా ముసలమ్మ తనదారి తను చూసుకుంది...

కొంగుముడి విప్పిచూస్తే - ఆవిడ దాచిపెట్టుకున్న యావదాస్తిన్నీ పదిహేడు రూపాయిల పైచిల్లర కాబోలు, వుంది. మీబావగారి చేతిమీదనే సవ్యంగా పిడికెడు బుగ్గయిపోయింది. ఏదో, ఆ పుణ్యాత్మురాలి తనువు బాగానే తర్లిపోయిందండి...

కాని - ఇంతమందిమీా కలిసి ఈ ఛాయని పట్టలేక పోయ్యాం. ఇప్పుడిప్పుడు కదటండీ, కాస్త మరుపులో పడిందీ...

ఈ చేటభారతమంతా చెప్పి మిమ్మల్ని విసిగించా నన్నయ్యగారూ. ఆడవాళ్ల కబుర్లే అంతలెండి. తలా తోకా వుండదు.

ధర్మారావు:— విసుగేమిటంటోయ్! వినవలసిన సమాచారం వినిపించారు. చాలా గమత్తుగా వుంది!

లలిత:— ఉన్నమాట చెప్పొద్దూ! - ఈ ఛాయ ఫోటోపటం చూసి, నాకు గుండె చెరువై పోయిందండి.

ధర్మారావు:— అదో ఆశ్చర్యం కాదు.

లలిత:— ఆమట్టున, మీా బావగారి దగ్గిర కెళ్ళి — "యేవండీ

మరి – మంచో చెడ్డో మనింటికి తీసుకురానే వచ్చారు. ఈ పిల్లని మనం ఉంచేసుకుందాం" అన్నాను...

అనేసరికి – "నే నొద్దన్నానా? అలాగే కానీ, నేనూ అందామనుకుంటూవున్నాను, ఇంతలోనే నా మాట నువ్వే అందుకున్నావు..." అని సమాధానం చెబుతూవుండగానే, ఆయనకి కళ్ళంట నీళ్లు గిర్రున తిరిగాయి...

సరే అనిచెప్పి – ఛాయని దగ్గరసా పిల్చి, జరిగిన సంగతంతా చెప్పానం డన్నయ్యా!...

చెప్పేటప్పటికి – పాపం, పిల్లకి గుండె నిబ్బరం కలిగింది, మొహం కాస్తంత తేటపడింది...

"అమ్మమ్మగారూ! తల్లీ దండ్రీ సమస్తమూ నాకు మీరేనండి. మా పాలిటి దేముడిలాగ వచ్చి రక్షించారు మమ్మల్ని. ఎన్నిజన్మాలెత్తినా మీరుణం తీర్చుకోలేనండి..." అంటూ దీనంగా అనేసరికి – నాకు కడుపు తరుక్కుపోయిందండి...

అంటే నే నన్నానూ: "అమ్మాయీ! నువ్వొకటీ మా పిల్లలొకటీ కాదమ్మా, నీకు చేతనైనపని చేస్తూ వుండు. దేము డిచ్చినకాడికి, మాతోపా టింత కలో గంజో తాగి ఖులాసాగావుండు. నీ కొచ్చిన భయం లేదులే" – అని మళ్ళీ మళ్ళీ ధైర్యం చెప్పాను.

ధర్మారావు:– అక్కయ్యగారూ! ఇదంతా నిజమేనా, లేక పోతే కలా! అనిపిస్తోంది.

లలిత:— ఈ ఛాయ – ఏ నిమిషాన మా గుమ్మంలో కాలు పెట్టిందో – ఒఖ్ఖపని చెప్పించుకోదుగదండి. ఎప్పుడు లేస్తుందో – ఎప్పుడు చేస్తుందో మరి – ఇట్టె యిట్టె చక్కబెట్టేస్తుంది పన్లన్నీని...

అవతల యింట్లో ఈదుకు వస్తూనే వుంటుంది – ఇవతల మళ్ళీ యింతలోనే రాతకోతలూ, కుట్టుపన్లూ, తను నేర్చుకోవటం, అవన్నీ పిల్లలికి చెప్పడం...

విన్నారా అన్నయ్యగారూ! అంధరికీ తలలో నాలికగా మసులుతూ వుందండి. ఈ వయస్సులో ఇంత బుద్ధీ కుదురూ ఎలా అబ్బిందో యేమిటో!... ఇదీ కధ.

ధర్మారావు:— ఇవాళ చాలా గొప్ప విశేషమే చెప్పారండీ అక్కయ్యగారూ. ఉభయ తారకమయిన సందర్భం. అ-యి-తే, ఇంతకీ యెవ రమ్మాయో చెప్పారుకారు.

లలిత:— ఇంటిపేరు అదేదో చెప్పింది. ఆ గొడవలో నేను సరిగ్గా వినేలేదు.

ధర్మారావు:— ఏదీ, పిల్లని ఒఖ్ఖమాటు పిలిపిస్తారూ, మాట్లాడాలి.

లలిత:— అమ్మా, ఛాయా! –

[ ఛాయ వస్తుంది. ]

ధర్మారావు:— అమ్మాయీ, ఇలా రా అమ్మా, నువ్వు ఎవర్ని పిల్లవి?

ఛాయ:– మా యింటిపేరు శిరిపురపువారండి.

ధర్మారావు:– [అత్యాశ్చర్యంతో] ...ఏవిటేవిటీ! శిరిపురపు వారా?–

ఛాయ:– మరేనండి. నాపేరు ఛాయంటారు?

ధర్మారావు:– అసలు, మీ దేవూరు?

ఛాయ:– మాది నందిపల్లెండి. మా అమ్మా, నాన్నా చిన్నప్పుడే కాలంచేశారండి. అప్పటినించీ ధర్మారంలో మా పెద నాయనమ్మ దగ్గిరే వుంటున్నాను. ఆవిడే నన్ను పెంచి పెద్దదాన్ని చేసిందండి.

ధర్మారావు:– అయితే, ఆవిడ మీనాన్నకి పెత్తల్లికదూ?

ఛాయ:– అవునండి. పాపం, బాల్యంలోనే భర్తపోయాడండి.

ధర్మారావు:– ఆవిడ పేరు?

ఛాయ:– కనకమ్మగారు.

ధర్మారావు:– క–న–క–మ్మా! సరి, సరీ. మరైతే — బండి గోతులో పడి బోల్తాకొట్టిందే! – అప్పుడు మీ రెక్కడికి వెళుతున్నారూ?

ఛాయ:– 'గరివిడి'లో మా నాయనమ్మకి తోడి కోడలుగారున్నారండి. ఇప్పటికే బంధువులకి దూరమైపోయాము; పోనీ, రక్తసంబంధీకులు గదా, ఆవిడైనా ఆదరించకపోతుందా అనుకుని బయల్దేరామండి.

ధర్మారావు:– హామ్మో్య ఛాయా! ఇలా దగ్గరకి రా అమ్మా !

[చేరదీసుకుంటాడు.] ...నువు చెప్పిన మాటలన్నీ తూచినట్టు సరిపోయినాయి తల్లీ! అయ్యో ఛాయా!

[ ఆమె చెయ్యిపట్టుకుని, తల నిమురుతూ ]

...గరివిడి మా గ్రామమే నమ్మా. మీరు వెడదా మనుకున్న ముసలమ్మ మా తల్లే. నీ తండ్రీ, నేనూ పెత్తండ్రి పినతండ్రి బిడ్డలం, తెలిసిందా? కాలమంతా అడ్డం తిరిగీ, మధ్యవాళ్ళ మాటలు నమ్మడంచేతా ఈ నాటి కిల్లా మొహాలు చెదిరిపోయినాయి...

మీ నాన్న స్టీమరు కంపెనీకి దుబాషీగా వుండే వాడు. అతడికి యెంత పేరు, ఎంత ప్రతిష్ఠ! మన కుటుంబగౌరవమంతా అతడితోనే పోయింది...

పాపం, మీ తల్లి– కృష్ణవేణి– నిజంగా అటువంటి మనిషుందా భూ ప్రపంచంమీద? అలా భర్తపోయే సరికి ఇలా గుండె బద్దలై పునిస్త్రీచావు చచ్చింది, మహా యిల్లాలు!...

అప్పటికి నువ్వింకా పసికూనవి, పాకురుతూ వున్నావు. ఏదీ, మళ్లా నిన్ని దేచూడ్డం. కళ్లు కాయలు కాచిపోయినాయే, నా తల్లీ! ఇదంతా భగవంతుడి మాయ గాకపోతే, నువ్విక్కడ దొరుకుతావని కల్లో ఐనా అనుకున్నానా?

ఛాయ:— మీ అభిమానం అలాటిది. అయినా, యెక్క–

డుంటే యేమిటండి బాబాయిగారూ! నాకు తలిదం
డ్రులు లేని లోటు కనబడలేదం డిక్కడ...

ధర్మారావు:– ఛాయా! నీ బుద్ధి, నీ నడత రావడంతోటే కని పెట్టేశాను. లలితక్కయ్యగారి చేతుల్లో మసలడ మేవిఁటి, మరోలాగ వుండడమేమిటి!

ఛాయ:– (కన్నీటితో) పాపం, చచ్చి స్వర్గాన వుంది మా నాయనమ్మ. ఎరిగున్నట్టు సరిగ్గా తీసుకొచ్చి, నన్నిక్కడ అప్పగించి తర్లిపోయిందండి...

ధర్మారావు:– ఊరుకో తల్లీ వూరుకో. ఆవిడకేం, ధన్యురాలు. నిన్నెక్కడ పడెయ్యాలో అక్కడే పడవేసి వెళ్ళిపో యింది. సుక్షేత్రంలో జారవిడిచింది, నిన్ను!

ఛాయ:– అమ్మమ్మగారు నన్ను కడుపులో పెట్టుకుని పెంచు తున్నారండి. తాతయ్యగారికి నేనంటే పంచప్రా ణాలూ నండి. మరి, బిడ్డలు నన్నొక్క క్షణంసేప యినా వదలరండి. ఇలాటి ప్రాపు దొరకడం ఎంత అదృష్టం!

ధర్మారావు:–అమ్మా! – చాలా సంతోషమయింది. ఇక్కడ– ఇలాటి పరిస్థితుల్లో నువ్వు కంటబడ్డా వనేసరికి– నిజంగా నా కెంతో యిదిగావుంది. నీ మాటలు విన్నకొద్దీ ముచ్చటేస్తూంది. మరి, ఇవేళ మనం బయల్దేరి వెళదాం. అందరితోటీ చెప్పి వస్తావా?

లలిత:— అమ్మ దొంగా! ఇన్నాళ్లాయె, ఈ సంగతి యెప్పుడూ చెప్పావుకా వేం ఛాయా! అయితే, నువ్వుల్ని వదిలేసి...

ఛాయ:— అమ్మమ్మగారూ! అనడమేకాని, నాకుమాత్రం కాలాడుతుందా?

ప్ర వే శం:

[ రామకృష్ణయ్య - భానుమూర్తి ]

రామకృష్ణయ్య:— ఓహోహో! బావగారూ. బహుకాల దర్శనం! ఊఁ, ఇవా ళెంత సుదినం! ఎంత సుదినం!!

ధర్మారావు:— సుదినమే కాదండోయ్. శుభదినంకూడాను.

రామకృష్ణయ్య:— ఊరక రారు మహాత్ము లన్నట్టుగా - మీరూ శోభనదేవతలు. మా కేదో పప్పుభోజనాలు తగుల్తాయన్న మాట...

ధర్మారావు:— ఈ మధ్యాని వేళపట్టుకి భోజనం లేదుకాబోలు, అంచేత భావగారికి అస్తమానం అదేదృష్టి. ఏవయినా చెప్పి వస్తాయటలెండి!

రామకృష్ణయ్య:— నిజమే, మీరన్న మాట. మంచైనా చెడ్డయినా - ఇంకో క్షణాని కేం జరుగుతుందో చెప్పలేం. ...ఈ ఛాయ చూశారా? ఆ పిల్ల యెవరో, మే మెవరమో - వచ్చి వచ్చి వాళ్ళ బండి మా పొలిమేరనే తిరగబడ్డ మేఁవిటి - ఊళ్లో ఇంతమం దుండగా ఈ అమ్మాయిని మేమే చేరదీయడ మేవిటి!— బావగారూ!

ఈ ఋణానుబంధాలన్నీ చిత్రంకదండీ ? ఇవన్నీ ఇలా జరుగుతాయని ఎన్నడయినా అనుకోగలమా ?–

ధర్మారావు:–అదీ వొక మంచికే. అనుకోని వింతలు మరికొన్ని వచ్చిపడ్డా యిప్పుడు.

రామకృష్ణయ్య:– అదుగో, ఏదో తెచ్చిపెట్టారు...

ధర్మారావు:– నేను కొత్తగా తెచ్చిపెట్టిందేమీ లేదు. ఇవాళ బయల్దేరిన వేళావిశేష మేవిటోగానీ, మనం మరికాస్త చేరువ కొచ్చాం.

రామకృష్ణయ్య:– అదేమి టదీ !

ధర్మారావు:– మీరు పెంచి పెద్దచేసిన ఛాయ యెవ రనుకున్నారు ? స్వయానా, మా పెత్తండ్రి మనవరాలు.

రామకృష్ణయ్య:– (ఆశ్చర్యంతో) యే–మి–టీ!– భేష్ భేషూ!! చిత్రంలో చిత్రం !!!... ఏవమ్మా, ఛాయా! మనింటి కెవరో చుట్టాలొచ్చారుటా ?

ధర్మారావు:– మరి, మీకూ అక్కయ్యగారికీ నమస్కారం చెప్పి, వెళదాం రమ్మంటున్నాను.

రామకృష్ణయ్య:– చుట్టరికం కలియడం సంతోషంగానే వుంది గానీ – ఛాయని వదలడం అంటే బెంగ పట్టుకుందండి.

లలిత:– ఆమాటే ఇందాకా నేనూ అన్నాను.

రామకృష్ణయ్య:– అమ్మా, ఛాయా ! నువు లేకుండా, మాకు క్షణం గడుస్తుందా తల్లీ ! బావగారూ ! ఏమో, ఈ

విషయంలో నేను మధ్యని పడను. పెత్తనమంతా మీా అక్కగారిదే కనక, మీారూమీారూ ఆలోచించుకోండి.

[ చిట్టి గబగబ పరుగెత్తుకొచ్చి ]

చిట్టి:— ఒసేవ్ రుక్కూ! మనింటికి చెన్నారిగా డొచ్చాడు, చూశావుటే?

రుక్కు:—ఉహుఁ! నే చూల్లేదు.

రామకృష్ణయ్య:— పట్టపగ లెవడొచ్చాడే, పిచ్చిపిల్లా!

లలిత:—ఎక్కడా? నడు, చూపించూ.

చిట్టి:— ఎక్కడో యేమిటీ, యెదటనే వుంటే? మిఠాయుండలు చేతులోపెట్టి, మన ఛాయని ఎత్తుకు పోతాట్టకదూ!

[ ధర్మారావు, రామకృష్ణయ్య తెగనవ్వుతారు. ]

రామకృష్ణయ్య:— ఓసి భడవా! పెద్దవారిని అలా అనొచ్చా? కుర్రజాతి లక్షణం...

ఛాయ:— చిట్టెప్పుడూ ఇల్లాటి మాటలే!

ధర్మారావు:— చిట్టీ! ఇంకా కోపం తగ్గలే?

[దగ్గిరకి తీసుకుని, బుగ్గలు నిమురుతాడు.]

ధర్మారావు:— ఏమండోయ్ భావగారూ! ఛాయ ప్రయాణానికి ఒకళ్ళూ "ఊఁ" అనరు, "ఆఁ" అనరు!

లలిత:—ఇక్కడికి కించుమించు పది పదకొండు నెల్లయింది. ఓ కంచాన తిని ఓ మంచాన పండుకుంటూ, కలిసి మెలిసి వుంటున్నారాండి, మరీ...విడిపోవడమంటే ఎలా మన సొప్పుతుందీ?

[ఛాయ, భానుమూర్తి ఒకళ్ళవంక ఒకరు జాలిగా చూసుకుంటారు.]

రుక్మిణి:— ఛాయా! మనం యివేళ సినీమాకెళ్ళాలి కాదుటే? నువ్వు రాకపోతే మేమూ వెళ్ళం.

ఛాయ:— రుక్కూ! ఇదిగాకుంటే మరొకటి చూదాం. మళ్ళీ వస్తూనే వుంటాము. ఐనా, ఇది హిందూస్తానీ ఫిలింట. మనకేం సరిగ్గా తెలుస్తుందా, యేమన్నానా?

చిట్టి:— మనకి తెలియకపోవడ మేవిటి? అంధరూ నవ్వితే మనమూ నవ్వుదాం. వాళ్ళేడిచి నప్పుడల్లా మనమూ యేడుద్దాం. అంతేనా, బ్రెహ్మాండం!

ఛాయ:— బాగా చెప్పావే, చిట్టీ!

[అందరూ పక పక నవ్వుతారు.]

ధర్మారావు:— బావగారూ! మీచిట్టి అసాధ్యురాలైపోతూంది. మాంఛి పెంకి మొగుణ్ణి వెతికి తెచ్చి, కట్టబెట్టాలి. అమ్మో!...

లలిత:— విన్నావా అమ్మాయ్! మామయ్యగా రేమంటున్నారో. అంతకంతకి దిష్పకాయవవుతున్నావు.

ధర్మారావు:— అయితే అక్కయ్యగారూ! మన భానుమూర్తి అటూయిటూ చెప్పకుండా వూరుకున్నాడేం?

లలిత:— చెప్పటాని కేముందండి! ఛాయ మీ బంధువని మాకేం తెలుసూ? ఆ పిల్ల వచ్చినాటినించీ వూళ్ళో నలుగురూ చేరి, "పిన్నిగారూ! మీరు కోడలు

గార్ని వెతుక్కో- అక్కర్లేదు. కలకల్లాడుతూ గృహ లక్ష్మి మనింటికే వచ్చింది. ఎంత భాగ్యమండీ!"

...అని ఇల్లా ప్రారంభించారు. మనసులో మాట చెప్పకపోవటమేం! పోనీ, మొదణ్నించీ వాళ్ళిద్దరూ చిలకా గోరింకల్లాగ అన్యోన్యంగా మసులుకుంటు న్నారు. పెద్దవాళ్ళమాట యెందుకు కాదనాలి. అలాగే కానిద్దాం అని చెప్పి, సరదాపడ్డాను. ఇంతవరకూ వచ్చి ఇహ దాపరికమెందుకూ! మా భానుకూడా ఇష్టమే అన్నట్టుగా కనబడ్డాడు. సరే అనుకున్నాం.

రామకృష్ణయ్య:- అయినా, వెనకటి ప్రసక్తి యిప్పుడెందుకూ?

భానుమూర్తి:- చెప్పుకుంటున్నవన్నీ వెనకటి గొడవలే కాదండీ, నాన్నారూ!

రామకృష్ణయ్య:- ఛ. వూరుకో. ఛాయ జమీందారుగారి బంధువని తెలిసీకూడా, అలా అంటా వేమిట్రా అబ్బాయి! వారెక్కడ, మనమెక్కడ!

ధర్మారావు:- అమ్మా, ఛాయా! ఇలా రా. ఇంతకీ నీ వుద్దేశ మేవిటో చెప్పావే కాదూ.

ఛాయ:- (సిగ్గుతో) బాబాయిగారూ! నేనేం చెప్పగలను? ఎప్పుడూ వారిమాట కాదనలేదండి.

ధర్మారావు:- తల్లీ! చక్కటిమాటచెప్పావు. చాలా హుందా ఐన ఆలోచన ... భావగారూ! అన్నట్టు - మీది కాశ్యపసగోత్రమే కాదూ?

రామకృష్ణయ్య:- అవును.

ధర్మారావు:- అయితే, శ్రీవత్సస గోత్రీకులకూ మీకూ సంబంధా లున్నాయన్నమాట.

రామకృష్ణయ్య:- అయ్యో, లేకేం ?

చిట్టి:- మనసు కలియాలిగాని, గోత్రాలూ సూత్రాలూ !...

రామకృష్ణయ్య:- చిట్టీ ! అవతల కెళ్లు, కాశ్చేపు. చిన్న నోటికి పెద్దమాటలు !

లలిత:- బాగానేవుంది, వరస...

ధర్మారావు:- ఇంకా నయం. చిట్టి లేకపోతే నా కసలేతోచదు. అయినా, తప్పేమా టేమందీ ? 'బాలవాక్కు బ్రహ్మవాక్కు' కాదుటండీ !...

మరయితే, బావగారూ ! — ఈ అమావాస్య వెళ్ళిన వెంటనే లగ్నం పెట్టించి, కబురు చేస్తాను. ఇప్పట్లో గ్రహబలంకూడా చాలా దివ్యంగా వుంది. అదీగాక, శుభస్య శీఘ్రం అన్నారు పెద్దలు. మరి, ఆలోచ నెందుకూ !

చిట్టి:- రుక్కూ ! నువ్వన్నమాట అబద్ధంకాదు. మామయ్యగారు నిజంగా మంచివారేనేవ్ !

ధర్మారావు:- బావగారూ ! చిట్టిని మీ రూరికే కోప్పడుతారుగాని, నా కెలాటి కితాబిచ్చిందో చూడండి మరి ?

[ న వ్వు తా డు. ]

లలిత:- అన్నయ్యగారు పేరు సార్థకపరుచుకున్నారు. అమ్మా, ఛాయా ! (దగ్గరకు తీసుకుంటుంది.)

రామకృష్ణయ్య:- బావగా రొచ్చారంటే మా కేదో విశేష ముందని నేను వస్తూనే చెప్పాను.

చిట్టి:- రుకూ్కా! నేను నాన్నగారి పార్టీ అన్నారుకాదూ, ఓ తాయిల్లంగారూ? నువు ఛాయపార్టీ కాయాలి. తెలిసిందా?

లలిత-: అబ్బబ్బబ్బా! — వస పోసిన పిట్టలాగ అ స్తమానం వాగుడే. మరీ మీరిపోతూంది. ఒక్కనిమిషం ఊరు కోవు గద, చిట్టీ! అల్లరి బా-జ్యా!!

ధర్మారావు:- బావగారూ!— మీ మాన్యానికి సరాసరి పడ మటివేపున నాలుగు వీసాల తోట వుంది, మెరుగు దురుగా! ఇప్పుడు పోలిగాడు చేసుకుంటున్నాడు. సాయంత్రం మన భానుమూర్తిని వెంట తీసుకెళ్ళి శిస్తూ దస్తూ అతడికి విలియా వేస్తాను...

చిట్టి:- అన్నయ్యా! తోటలూ దొడ్లూ మన కెందుకురా? నాన్న కొనమంటే కొనడుగానీ—దర్జాగా మోటారు సైకిలూ, ఓ రేడియోమిషనూ కోరుకో, యేం?

భానుమూర్తి:- (మందహాసముతో) ......అల్లాగే చెల్లీ!- (నెమ్మదిగా) బోణీకానిద్దూ. తరువాత సంగతిచెప్తాను.

రామకృష్ణయ్య:- బావగారూ! - ఇదంతా భగవద్విలాసం కాకపోతే, మరే మనుకుంటాం!!.

లలిత:- చేసుకున్న సుకృతం యెప్పటికీ పూరికేపోదు. నిజంగా

ఇంతకంటే దాఖలా యేంకావాలీ! దేము డెక్కడో వున్నాడని వెర్రిపడతాంకానీ, మనలోనే వున్నాడు!

ధర్మారావు:- సరే, అక్కయ్యగారూ! ఈ వర్తమానం వెంటనే ఇంట్లో చెప్పి, పన్లు కానిమ్మని తొందర చెయ్యాలి. మరి, మీ యత్నంలో మీ రుండండి. బావగారూ - కాదు, కాదు. వియ్యంకుడుగారూ!- అబ్బాయి జాతకం ఒకసారి తీయిస్తి రంటే పట్టుకు వెళ్లి చూపిస్తాను.

ఛాయా!- మనం రాత్రి ప్యాసెంజరుకి తప్పకుండా వెళ్లాల్సుమీ. పెట్టే బేడా సర్దుకో.

చిట్టి:- రుక్కూ!- అవతల పెళ్లివా రొస్తే - విఘ్నేశ్వరుడిలాగ కూచుంటావేం! పాటలు చెప్పుకో. రా.

"పెళ్లివా రొచ్చిరే పెళ్లివారు
బాజాలు లేకుండ
పల్లకీ లేకుండ .... //పె// "

రావే, రుక్కూ. పొలానికెళ్లి చిన్నన్నయ్యతో చెప్పొద్దాం.

రుక్కు:- పద, పదా.

[ పాడుతూ వెళతారు. ]

## పాత్రలు

| | |
|---|---|
| శంకరం | కామేశ్వరి |
| కొండప్ప | ప్లీడరు |
| పఠాభి | జడ్జి |
| గోపాలం | పబ్లికు ప్యాసిక్యూటరు |
| కోటయ్య | నర్సిగాడు |
| పురోహితుడు | కుర్రాడు |

బంట్రోతు, మూకలో జనం.

---

† మద్రాసు కేంద్రమునుండి ప్రసారితం: 15–5–40

[5]

# ఫూత

[ శంకరం, కొండప్ప వీధిలో ]

శంకరం:– ఓరే కొండిగా! అదంతా ఫక్తు రంగూన్ కలప. ఒకొక్క దూలమే చేస్తుంది యాభయ్యేసి రూపాయిలు. దానిముందు ఉక్కెందుకూ పనికిరాదంటే నమ్ము. ఒక్క ద్వారానికైనా ఇనపమేకు లేదుకద. భవనం యావత్తూ సిమెంటు చపటాలే కాని, మచ్చుకయినా ఒక్క పెంకు ముక్క అవుపడదు. అంతా మెడ్రాస్ ఫేషను. అంతా కోటకి మించిన ఫకడ్బందీ. ఆ పంఘిణీయే వేరురా. నిజంగా ఆ హావేలీ చూడని నేత్రాలు నేత్రాలే కావంటాను.

కొండప్ప:– ఓరి బ్రభ్రాజమానఁవా! నీ కొచ్చాలన్నీ మన దగ్గిర కొయ్యకు. చేతులో పిక్క ఆడుతూవుంటే– మెడ్రాస్ ఫేషన్లే కాదు, లండన్ ఫేషన్లూ కూడా నేనూ తెచ్చి పెటతా.

శంకరం:– ఏడిశావులే. డబ్బుండంగానే సరా, దేము డిచ్చినందుకు సార్థకంగా తనింత తిని, ఒకళ్లకింత పెట్టడం మన గోపాలంగారొక్కడికే చెల్లింది. ఆ మారాజు మూడంతస్తుల మేడ కట్టాడూ అంటే–తస్సాదియ్యా, "దేవీభవనం" రాజధానంతటికీ పేరెళ్లిపోయింది గదుట్రా!

కొండప్ప:– ఆ!– అయిందిలే భోగం! గోపాలంగారూ, నేపాళంగారున్నూ! పాతికేళ్లనాడు పోటీ గీటీ లేదుకాబట్టి,

రైసుమిల్లు పెట్టి ఇష్టమొచ్చినట్టుగా దోచుకున్నాడు. ఇంకిప్పుడా పప్పులేం ఉడకవ్. నీరూ నిప్పూ పుట్టని కుగ్రామమైనా సరే, బియ్యంమర వుండితీరాలి. ఎక్కడో మాటెందుకు?– మన వెంకటాపరంలోనే పక్కలో బల్లెంలాగ కోటయ్యగాడు మరోమిల్లు లేవదీశాడా? వాడూ గోపాలమూ, ఒకళ్లని కాదని ఒకళ్లు రేట్లు కోసుకున్నారా? ఆఖరి కది వాళ్లకి గొంతుక్కోతగా పరిణమించిందా?

శంకరం:– హాఁ! కొండతో గొర్రె ఢీకొట్టవటమా? అందుకనే కోటయ్యకి శుబ్భరంగా తిరుక్షవరమై, దివాలా తీసి, మాసిపోయి మట్ట మయ్యాడు. పురాతనంగా పాతుకు పోయిన గోపాలంగారితో ఈ దౌర్భాగ్యశిరోమణికి పోటా పోటీలా? ఒక్కనాడు ఆయన ఎడంచేత్తో దానంచేసిన పాటిలేదు, వీడి ఆస్తంతా పోగు జేస్తే...

కొండప్ప:– గోపాలమే కాని, మరెవ్వడూ బతకూడదా యేమిట్రా? ఆయనేం వూరికి పుస్తె కట్టాడా?

శంకరం:– ను వ్వేమనూ. ఇవన్నీ బతకదలిచి చేసే పన్లు గావు. అయినా, అదేమిటో గాని, మాయలోకం – నాలుగురాళ్లు వెనకేసుకున్నవాణ్ణి చూస్తే అలోమని యేడ్చిపోతుంది, కళ్లల్లో నిప్పులోసుకుంటుంది.

కొండప్ప:– ఒరే శంకరీ! మొత్తానికి గోపాలం బంగారు పిచ్చిక. పెట్టి పుట్టాడు, కలిసొచ్చింది. దైవం తిన్నగా జూశాడు, బావుటా యెగిరింది. అంతవరకూ చెప్పు,

ఒప్పుకుంటాను. ఆయనగారు మూడంతస్థుల మేడ కడితే ఎవడి కేమిటి గొప్ప !

శంకరం:- ఎవడి కేమిటీ ! మన వెంకటాపరంలో ఇటువంటి ధర్మదాత ఉన్నా డంటే మనకే గొప్ప...

కొండప్ప:- మహా దొడ్డదాత దొరికా డెలాగయితే యేం ! సంతోషించాం; చాలించు.

శంకరం:- అరేయ్ కొండా ! రే పొచ్చే నవరాత్రులతో కలిపి గోపాలంగారి నూతన గృహప్రవేశ మహోత్సవం. ఇదుగో గాన కచ్చేరీలు జరపటానికి మైసూరునించి ఆస్థాన విద్వాంసులు దిగబోతున్నారు. తెలిసిందా? మరి, దేముడు చాలాచాలా మేలుచేస్తే, తంజావూరునించో శ్రీరంగం నించోగాని సొనాయిమేళాలు,- ఇంకా, వాటి దుంప తెగా, ఏమేమిటో చిత్రాలుట్రా...

కొండప్ప:- అవున్లే. వూళ్లో పెళ్లయితే, మధ్యని కుక్కలకి అడావిడి హెచ్చుట. అలాగ్గా...

శంకరం:- ఒరే కొండిగా ! ఆ తొమ్మిదిరోజులూ - అప్పుడూ యిప్పుడూ అనకుండా- చాతుర్వర్ణాలకూ,- హా! హ్హా! హ్హా!- పద్ధెనిమిది పిండివంటలతో నిరతాన్న మహాప్రదానం... విన్నావా !-

[ ప్రవేశం : పోలిగాడు ]

కొండప్ప:- ఏఁవిరోయ్, పోలిగా !-

పోలిగాడు:- దణ్ణాలండి బాబయ్యా.

కొండప్ప:— ఇలా రారా, గాడిదకొడకా! ఏవిటా తొందర?

పోలిగాడు:— యీది యీదంతా – ఆ కణ్ణించి ఈ కడకి పందిళ్లేసుకు రావాలండి. మరిగంటే, రాటలకోసంవని తుమ్మలబీట్లో కెళ్లొత్తానండి.

కొండప్ప:— అవునుగా నారే! నిన్నో సంగతి అడగాలి. మర్మం లేకండా చెబతావా, లేదా?

పోలిగాడు:— అశెశ్. తెల్చునండీ, ఇయాలకు వందమం దడిగ్రను. యేమో, నిజం బగమంతుడికే తెలాల. మా దొరగారి బవనం మనిషిని మింగుతానంటుదంట. వూళ్లో యెక్కడ సూశినా యిదే గోల!

కొండప్ప:— సరేలే. నువ్వెళ్లు. పని చూసుకో.

[ పోలిగాడు వెళతాడు ]

విన్నావుట్రా, శంకరీ!— జనవాక్యం!— నాలుగురోజులు మెతుకుల కోసమున్ను, సంభావన డబ్బులకోసమున్నూ ఆశపడి, లోకం నోరు ముయ్యడానికి చూస్తావుట్రా, అబ్బాయ్?

శంకరం:— అడుగడుగో. వృద్ధజంబుకం – పతాభితాత దిగు తున్నా డెందుకోగాని.

కొండప్ప:— పతాభితాత నిజంగా పూర్వపుణ్యంకొద్దీ అవత రించా డనుకో, మన గ్రామంలో. ఢిల్లీ కెళ్లినా ఆయన మాటకి తిరుగులేదు. అంత ఘరానా!

రండి, రాండి తాతగారూ! ఇప్పుడే మీ మా టను కుంటున్నాం.

[ ప్రవేశం పఠాభి ]

పఠాభి:- తల నెరిసిపోయిన ముండావాణ్ణి, నా మా టెవరు లక్ష్యపెడతారు నాయనా! ఏదో నాలుగురోజులూ 'రామా కృష్ణా' అని గడిపేస్తే, కళ్లు మూసేస్తాం, వొదిలి పోతుంది.

కొండప్ప:- ఇంకా నయం. మీవంటి పెద్దబుర్రలు ఉండబట్టే, కాస్తంత మనగ్రామం ఇలా అయినా వుంది.

శంకరం:- నిజమే. మన వూరికి మణిపూసలాగ గోపాలంగా రంటూ ఉండబట్టే ఈమాత్రం వాసయోగ్యంగా వుంది; ఈపాటైనా సన్యంగా వెళుతోంది కాలం.

పఠాభి:- పరమ లుచ్ఛా...ఆ పాపాత్ముడి పేరు నా దగ్గి రెత్తకు. వాడినించే నిక్షేపంలాంటి వెంకటాపరానికి పీడట్టుకుంది...

కొండప్ప:- అటువంటి మనిషి ఈ జిల్లా మొత్తం మీద లే డంటాడండి మన శంకరం.

పఠాభి:-వా డొట్టి ఛండాలపు ముండాకొడుకంటే నమ్ము, కొండయ్యా. మొన్న యెలక్షన్లలో మన వోట్లన్నీ కూడ గట్టుకుని, తన రైస్‌మిల్లుకి సరాసరి రోడ్డేయించుకున్నాడు కదా ! అ దలా వుండనీ. మొన్న నీమధ్య కొత్తగా రప్పిం చిన పెద్దమిషన్లు రెండింటికీ కన్నుమూసి తెరిచే లోపల, ఓ నాటకం పెండాలంత గొడాం కట్టించిపారేశాడు, తెలుసా? దీని కంతకీ వాడి బాబుగారి ముల్లె ఎక్కణ్ణించి

తెచ్చి పెట్టాడనుకున్నావ్? కుర్రవాడమ్మలకి ఈ పాలిటి క్సన్నీ ఏమి అర్థం అవుతాయి? తెల్లటి వన్నీ పాలే అను కుంటారు !—

శంకరం:— కొండా! నే నిందాకానే చెప్పాగానట్రా. పచ్చగా ఉన్నవాణ్ణి చూస్తే దిక్కుమాలిన లోకం కన్ను కుట్టు కుంటుంది......

పఠాభి:— ఓరి కుర్ర దామోదరుడా! నిప్పు లేందీ పొగ పుట్ట దోయ్. నిన్నగాక మొన్న పుట్టి, నాకు ధర్మపన్నాలు చెప్పొస్తున్నావా?

కొండప్ప:— వాడితో ఏమిటి పోనిద్దురూ తాతా! ఇప్పు డిస్కులున్న బిల్డింగూ, మన గోపాలంగారు దానం చేసిందేటగా! అందుకనే అంధరూ ఆయన్ని మహానుభావు డంటూరు...అయినా, దీని ఆంతర్యం మీకు తెలియాలి గానీ......

పఠాభి:— గ్రామం యావత్తునీ మంత్రించినట్టుగా ఇలానే కట్టే శాడు...వె-ధ-వ! ఉత్త చవటలు కాకపోతే, ఇటువంటి దివ్యసౌధం చేతులారా ఎందుకు ధారపొయ్యాల్సొచ్చిందీ? అనే పాయింటు ఒక్కళ్లయినా యోచించారూ? నన్ను రెచ్చగొట్టకు కొండయ్యా, ఇవన్నీ చాలాకాలమై వొది లేసుకున్నా.

కొండప్ప:— అలా అంటేకాదు, తాతగారు! నిజంగా, మీ రో వొడ్డు కాయబట్టి గాని, వెంకటాపరం అంధకారబంధు రంలో పడిపోనుగదండీ!

పోనీగాని,— ఇప్పుడు కొత్తగా కట్టిన మూడంతస్థుల మేడని గురించి ఊరూవాడా పుకార్లు మోగిపోతున్నాయి కదూ, మరి పెద్దలు మీ వుద్దేశ మేమిటి?

పతాభి:— ఓరి అబ్బాయిలూ! మన గోపాలంగారు రైస్‌మిల్లు కట్టాడు చూడండీ. అది కట్టినప్పట్లోనే దేవత నరబలి కోరింది.

మరి వొచ్చీ, అక్కడ పనిచేసే కూలీల్లో ఒకడు అప్పటికప్పుడు అదృశ్య మయిపోయినట్టు లోకం చెప్పుకోవటం జ్ఞాపక ముందా? అయితేమటుకి చెట్టుని ఒక్క ఆకు రాలిపోయింది! ఎవడి క్కావాలి ఆ సంగతి. వూరూ పేరూ లేని వెంకటప్పయ్యలకోసం ఉన్నాడా చచ్చాడా అని వెతకటానికి ఎవడి కంత పట్టింది? ఏదో ఆషామాషీ — మసిపూసి మారేడుకాయ — చేసేశారు, ఐపోయింది! గప్ చిప్!!

కాదుగానీ, తెలియ కడుగుతాను: ఎటువంటి ఉగ్ర శాంతులూ జరపనిదీ మన గోపాలంబాబు ఇంతటి మొనగా డయినాడోయ్, పిచ్చిపుల్లయ్యల్లారా! నాకింక తిక్క త్తించకండి. తీగ తీస్తే డొంకంతా కదుల్తుంది...

[ వెళ్లిపోబోతాడు. ]

కొండప్ప:— తాతగారూ! మీరు కోపగించి వెళ్లిపోతే కాదు. పిల్లలవాళ్లం. ఇం టిల్లిపాదీ హడిలిపోతున్నాం. మీ రేదో వొక ఉపాయం చెబితే కాని, గుండె తాళకుండా వుంది.

ఊళ్లో ఒఖ్ఖళ్లూ కణం కొరకటం లేదు, కన్ను ముయ్యటం లేదు. బెంగెట్టుకు ఛస్తున్నారు...

పఠాభి:— మన దేవత ఊరుకున్నంతసేపే గాని, తలుచుకుందిరా అంటే కుటుంబాలు కుటుంబాలే ఎగిరిపోతాయన్న మాట. అంతటితో వూరుకోదు. గ్రామాన్నంతటినీ ఒక్క కబళంకింద వూదిపారేస్తుంది. ఇహ నే నేమీ చెప్పను.

* * *

[ కాళికాదేవి ఆలయం : ప్రజల కోలాహలం. ]

(గంటలు మోగిస్తూ, పురోహితుడు మంత్రాలు చదువుతూవుంటాడు. జనం ఊసులాడు కుంటూవుంటారు.)

"తల్చిగోచింది! కాళీకోత్సవం చూత్తే మన యెంకటాపరంలోనే సూడాల. కలకత్తాలో కూడ యింతిగ్గురం లే దంటరా!"

"ఓహోహోహో! ఏమి ఆ కళాసౌందర్యం! ఏమి ఆ జవహారి వైభవం!!"

"ఒరేయ్, మెళ్లో ఆ మనిషిపుర్రె సూడరా. ఉః! ధగధగలాడుతూ — తళుక్కుమంటూ — ఆ ఖడ్గం దేంతో చేశా రంటవ్ ?—"

"కాళీమాయీ, తల్లీ! ఆదిశక్తీ! రక్షిచ్చు, రక్షిచ్చు! మమ్మల్ని చల్లగా చూశావంటే, వచ్చే పండక్కి మూడు మేకపోతుల్ని..."

"హ-హ-హ్హా ... బాపన జల్మెత్తలేదంటయ్యా !– "

పురోహితుడు:– హరహరహర ! ఓం...–"

"హూం! తల్లి పవిత్రపాదాలు రక్తప్రవాహంలో మునిగి తేలాల...యెయ్, యే ఎయ్..."

"వాశ్శాశ్, ఆ కోరలు సూడనోయ్. ఈరుడైనా సరే, టారెత్తి పరుగుచ్చుకోవాలన్నమాట."

[ కాళీదండకం—ఇద్దరు పఠిస్తూవుంటారు. ]

"శ్రీమన్ మహారేణుకాశక్తి దుర్గీ మహామ్మాయి చాముండి కౌమారి కాత్యాయనీ చిత్రరేఖావతీ దైవ చూడామణీ రాజకంఠీరవీ లావణ్యాసంభూత సౌభాగ్యలక్ష్మి దయాంభోనిధీ రాజరాజేశ్వరీ మూలమంత్రాక్షరీ భజే స్వస్వరూపం నమోఉగ్రరూపం నుతాశక్తిరూపం, శాంకరీ శాంభవీ శంకర స్వాంభవీ శృంగారధారీ ఓంకారరూపీ భవానీ భవన్మాయ తెల్పంగ నే నెంతవాడన్, నీవా త్రిలోకంబులెల్లన్ సృజింపన్ కృపాదృష్టి నీక్షింప, శిక్షింప రక్షింప త్రిమూర్తి స్వరూపంబులున్ దాల్చి వర్తింతువౌ తల్లి బ్రహ్మాండ భూతంబు లెల్లన్ తగన్ కుక్షిలో నుంచి వీక్షింతువో తల్లి,......దైత్యాళి రక్తంబు గ్రుక్కిళ్లతో బుక్కిటన్ గ్రుక్కిటన్ గ్రోలుచున్ కుంభి కుంభంబులన్ వ్రాక్కలై స్రుక్కి హుంకార ఘీంకారముల్ చేయ, కుంభి నిన్ వేగ లంఘించి తిద్దానవానీకము ల్పట్టి, ప్రాణంబులన్ గొట్టి పాశంబులన్ జుట్టి కుంతంబులన్ జీరి, బాణంబు

ఖడ్గంబుచే తుండతుండీలు ఖండించి భూతభేతాళ శాకినీ ఢాకినీ కోటులన్ తృప్తి పొందించ...కృపం జూచి రక్షించు కాళీ పరంజ్యోతి భూలోకమాతా నమస్తే నమస్తే నమస్తే నమః.''

[ మళ్లీ జనంలో ముచ్చట్లు ]

''వాశేశ్, కుర్రాణ్ణి విగ్రహం దెగ్గిరకి తీసుకురా వొద్దంటే నీక్కాదూ? జడుసుకుంటాడు...''

''గోపాలంబాబుకి యెంత బత్తిరా దేవంటేను? అన్నీ తనే సూసుకుంటడు, తనే శేసుకుంటడు, దర్మపెబువు.''

''ఆరి కమ్మోరు యిలువేలుపాశ్. అందుకనే అంతోటి తాపర్తాయం...''

'''యేఁవే, వెంకమ్మా! మీచెల్లెలికి పురుడొచ్చిందా?''

''ఇంకా లేదు పిన్నీ! మద్దిణాల మా కుర్రాణ్ణి పంపుతా గానీ, జానెడు దొండతీగ ముక్క పంపిద్దూ.''

''అరే, బ్లెడీ ఫూల్! ఆడవాళ్లను రాసుకుపోతావ్, కళ్లు నెత్తిమీద కొచ్చాయా?''

( గంట గణగణ మోగుతుంది. )

[ దేవికి హారతి ఇస్తారు. ]

పురోహితుడు:— అంధరూ రెండువరసలుగా కూచోండి, ప్రసాదా లొస్తున్నాయి.

* * *

[విరామం — 8 గంటలు వినపడతాయి.]

కామేశ్వరి:— బాబోయ్! రక్షించండి నాయనోయ్! ఆలస్యం చెయ్యకండి తండ్రోయ్! నా బాబు నాకు దక్కడు, వెళ్లండి బాబోయ్...ఇంతమందీ జెమాజెట్టీల్లాటి మొగాళ్లుండి దిక్కుమాలిన ముండని రక్షించ రేమర్రోవ్!

గుంపులోనించి ఒకరు:— "నీ పు సు రు తగుల్తుందిలేవమ్మా గాడిదకొడుక్కి, వూరికే పోదులే..."

మరొకడు:— "మాయలాడి దేముడికి ఈ దిక్కుమాలిన పక్షే కనిపించిందా!..."

ఇంకొకడు:— పోపోశ్! దేము డెక్కడున్నాడు? కలికిమూర్తి నాలుగుపాదాలా కదం తొక్కుతావుంటే——

"ఉండండి, పఠాభితాత వస్తున్నాడు. దీనికి ఆలోచన ఆయనే శెప్పాల."

[ప్రవేశం: పఠాభి]

పట్టాభి:— నేను మొన్ననే చెప్పలేదటయ్యా, ఆ మహాను భావుడు ఇదివరకే కూలివాణ్ణి బలివేశాడనీ? ఎంతనెత్తురు పారందీ ఆ మిల్లు కట్టడమైందీ? ఇప్పుడీ మూడంతస్థుల భేతాళగృహానికి ఎన్ని రక్తపుకాలవలు ప్రవహించాల్సి వుంటుందో! బుద్ధిమంతులు మీరే ఆలోచించుకోండి! నే చెప్పటమెందుకూ.

ఒకడు:— తాతగారూ, మీరలా తప్పుకుంటే కుదరదు, ఈ యెవ్వారం. నడుంకట్టి పని శెయ్యాలె. ఇయాళ ఆవి

వైంది, రేపు మనమవుతం. తలమాసినముండ అలో
మంటే గ్రామానికి అరిష్టంకాదూ ?

మరొకడు:— ఓ రెతవమ్మో! తాతసంగతి నీకు తెలవదు.
రాస్యం కాంతా వూదెయ్యటం...వుసిచ్చి వదిలెయ్యటం
...అంతే...తక్కిన పనంతా మనం జరుపుకుపోవాల...

ఇంకొకడు:— వొరేయ్, ఇందాకా కోలాటం వేశారు
పిల్లలు, ఒకేళ వాళ్ళతోగాని పొయ్యాడేమో...

వేరొకడు:— అవున్రోయ్. పద, పద, కనుక్కొద్దాం.

[ కోలాటం ]

*"దేవకీపుత్రాయ*
*దేవదేవోత్తమాయ*
*భావజా గురువరాయ*
*భవ్యమంగళం ॥*
*విమలరూపాయ వివిధ*
*వేదాంతవేద్యాయ*
*సుముఖచిత్తార్చితాయ*
*శుభగమంగళం ॥*
*రామచంద్రాయ జనక*
*రాజజామనోహరాయ*
*మామకాభీష్టదాయ*
*మహితమంగళం ॥....*

కోటయ్య:—ఇదుగో ఇలా చూడండీ !

అందరూ:— ఉండొరే, కోటయ్యబా బేటో సెబుతున్న
డినండోశ్...

కోటయ్య:— ఇవన్నీ యెందుకొచ్చిన కబుర్లా అంట. తెల్లా

రితే రేపు మన గోపాలరావు పంతులుగారి 'దేవీభవనం'లో గృహప్రవేశం. మనం యిక్కడ వాదా లేసుకుంటూ కూర్చుంటే, కావలసిన కార్యం కాస్తా అక్కడ చల్లగా జరిగి వూరుకుంటుంది. బలి అనేది సామాన్యంగా సుము హూర్తానికి ముందే జరిగిపోవాలి కనక, బహుశా ఈపా టికే ఐపోయుంటుందేమో నని నా అనుమానం. ఏదైనా పాపం, కుర్రకుంకడి జీవాలు పుచ్చుకోకముందే తొందర పడాలి. తీరా తరవాత ఏమనుకున్నా సార్థకం లేదు...

జనం:— అవునవును.

జనం:— రైట్, పదండి!

జనం:— యెళదాం, ఇప్పుడే వాడింటికెళదాం.

జనం:— తలుపులు బద్దలగొట్టి, సోదా శేదాం.

[ కుక్కల మొరుగులు ]

జనం:— దుర్మార్గుడికి బాగా బుద్ధిసెప్పాల.

జనం:— ఓరి యెంకా! మా యింటి కెల్లి, అటకమీద శాపాటి దుడ్లున్నయి, అయ్యన్నీ పట్రా...ఊ...ఇక్కడున్నట్టు రావాల.

[గడియారం 11 గంటలు కొడుతుంది.]

జనం:— ఈడి బతుక్కి పారావా డొకడు! కొాష్టేశ్ ఒక్క టెంకిజెల్ల...

జనం:— ముసిలికాలవు ముచ్చట్లురా, హా! హా! హ్హా! ...

జనం:- నడుమంతరపు సిరి ! యేటనుకున్నవ్! హాల్లాపెల్లా మంటంది.

[తలుపులు బద్దలగొడుతూ]

జనం:- ఓరి మాయలముండాకొడకా, బలెయ్యటానికి నీకా దిక్కుమాలినదాని నిసుగే దొరికినాడంట్రా ?...

జనం:-అప్పుడే అంతా ఐపోయిందిగామ్రలా...

జనం:- ఇదివరకల్లా యేమిటో అనుకున్నాంగానీ, నీ కిరాతప్ప న్లన్నీ తెలిసొచ్చాయిలే. నిన్నూ, నీ మూడంతస్థుల మేడనీ నిమిషంలో నేలమట్టం చేశేస్తాం చూస్కో...

కోటయ్య:- మా వెంకటావరానికి దాపరించిన ఓ బ్రహ్మ రాక్షసీ! పిల్లవాణ్ని తీసుకురారా యివతలకీ.

గోపాలం:- పిల్లవా డెవరూ ? ఎవరి పిల్లవాడండి కోటయ్య గారూ?...

జనం:- ఆ తియ్యటి మాటలు చూడు. మెత్తటి పులి...

జనం:- ఏమీ ఎరగడు, ధర్మరాజు. ఖూనీల రాయుడు...

జనం:- నిండుకుండ తొణకదండీ!...

కోటయ్య:- అరేయ్, భటాచోర్ !— నీ దేవత నరబలి కోరటం...కామేశ్వరి కొడుకుని నువ్వు పొంచి పట్టడం... చాలాకాలం క్రితమే కనిపెట్టాం. గ్రామం యావత్తూ ఒఖ్ఖలా కోడై కూస్తూంది. నీ వెధవ్వేషాలన్నీ లోకానికి తెలియవనుకోకు...

గోపాలం:- అయ్యో దేముడా, పిల్లలకోస మని ఓమూాల

మేము తపించిపోతూ వుంటే...నోరులేని కుర్రవాణ్ణి చంపడమా? రామరామా! మీ రెల్లా నమ్మారు ఈ కబురు కోటయ్యగారూ? ఎంతవిడ్డూరమూ కాకపోతే, యేమిటీ పుకారు! సత్యప్రమాణికంగా పెద్దలుకట్టిన ఇంటికింద వుండి చెబుతున్నాను. నే నేపాపం యెరగను...

ఒకడు:- ఈ భడవాకబుర్లన్నీ మాకొద్దు. కామేశ్వరమ్మ కొడుకుని మీఇంటిదగ్గిర చూశాం. వాడిక్కడే మాయమై పోయాడు. ఇప్పుడు సోదా చెయ్యాలె.

గోపాలం:- అలాగే చెయ్యండి బాబూ! పాపం వుంటేకద భయపడ్డానికి!

ఒకడు:- పోడు, పోడూ!...

గోపాలం:- అ—మ్మా!

జనం:- ఒక్క గుంకీపోటు... మచ్చు సూపిచ్చరా..

జనం:- యేడిశావ్. బుర్ర మయాన్న సూశి దుడ్డు తిరగెయ్యహే...

జనం:- వొద్దొద్దు...జీవం పోతే యేముంది? బుద్దిరావాల... వూచి పుచ్చుకుని, ఇద్దిలాగ్గ వొక్కలెంపకాయ... (ధ్వని)

[కుక్కల మొరుగులు]

జనం:- చఛా. పని శేత్తే, జెన్మ జెన్మానికి గేపక ముండాల.. కుడికాలుది పనికిరాదు. ఉహు...ఎడంకాలు పైజారు తీసి, ఒకటోరకమైన... (ఫడీ, ఫడీ- ధ్వని)

జనం:- కసాయి వోడయినా నయమే...

గోపాలం:- కోటయ్యగారూ!... మీకంత అనుమానంవుంటే నన్ను బలివెయ్యండి, కసి తీర్చుకోండి. దుర్భాషలాడకండి, బాబూ! ఎందు కింత ఆవేశం !

ఒకడు:- ఈ మెత్తటి మాటలు విని ఇన్నాళ్లూ గ్రామం కళ్లుమూసుకుంది.

జనం:- అరేయ్, ఈ గుడ్డ సూశా? నెత్తురు మరకలు! ఆఁ!!!

జనం:- అయిపోనాదిరోయ్, పిల్లాణ్ణి పొట్టనెట్టేసు కున్నాడు.

కోటయ్య:- ఏమిటీ ! రక్తపుగుడ్డలా !!

జనం:- దొంగనా కొడుక్కి- శేతు లెలా వొచ్చినాయో... మళ్ళీ బాపనపుట్టక పుట్టాడు...

జనం:- ఏం పుట్టక పుడితే యేట్రా, నీతి లేక పోనాక...

జనం:- ఎంత ఘాత ! యెంత ఘాత !!

జనం:- మండ లిరగ్గొట్టేశ్... ముందూ...

కోటయ్య:- వద్దు. వద్దు. నోరు ఖాళీ చేసుకోవద్దు. వొంటి మీద చెయి వెయ్యొద్దు. క్రిమినల్ లోకి దిగిందంటే మధ్యని మనం నేరస్థులమవుతాం. రాజయ్యా! ఆ నెత్తురు గుడ్డ జాగర్తగా పట్టుకు పద. తరువాత సంగతి నేచెప్తాను.

జనం:- పి-ల్లల-పులి!!!

[అందరూ వికటంగా నవ్వుతారు ]

జనం:- కేసు బణాయించనీ. పిల్లలపులి రంగు బయటపడతది!

[పరుగెడుతున్న చప్పుడు.]

ఒకడు:- ఏమిట్రోయ్. అలా పరుగు లెడుతున్నా న్?

మరొకడు:- రామకోయిల కాడ...... మున్సీబునాయుడు మీాటింగంట...రారా, సప్పుని...

* * *

మున్సీబు:—| సూడండి, అబ్బాయిలూ! ఈచ్చణంనించి గోపా ల్రావుని యెంకటాపరంలో యెలేత్తున్నాం. వెట్టివాళ్లు ఆ పక్క తొంగి సూడకూడదు. ఒక్కపిట్టయినా అక్కడ వంగి వాలకూడదు. తెల్సిందా?

అందరూ:— యెల్లమండి బాబయ్యోరు. గిజామని చచ్చినా సరే, యెల్లమండి.

ఒకడు:— ఇప్పుడా మేడయెంపు తిరిగి అంధరూ ఛీ! థూ! అని కాండ్రించి వుమ్ముతున్నరండి.

మున్సీబు:— షప్టూ...బలేపని శేశినారు.

ఒకడు:— అప్పుడే అది దెయ్యాలకొంప అని పేరడిపోయిందండీ.

మరొకడు:— పడదూ? పాపం పండితే యేమవుద్ది?

మున్సీబు:— ఇదుగో, ఈ రోజు మొదలుకుని ఆరి మిల్లుకి యెవ్వరూ దాన్యం పట్టికెళ్ళకూడదు. బంద్ కరో! అందరూ కోటయబాబు మిల్లులోనే ఆడిచ్చుకోవాల.

అందరూ:— అల్లానే.

మున్సీబు:— మరి, యెవడెల్లా సాచ్చికం శెప్పాలో...అదంతా రేప్పొద్దుట...కోటయబాబు వాకీల్ దగ్గిర్నుంచి రాంగానే కబురెడ్తాను. ఎల్లండి!

[ కోర్టువద్ద జనం ]

"ఇవేళ అటో ఇటో తేలిపోవాలి."

"ఇప్పుడేం? రిమాండులో ఉంచినా్నడే తేలిపోయింది."

"వొరే,—మనలో మనమాట—ఏమిటవుతుందంటావ్?"

"ఏటిరా యెర్రిమొగ(వా—న్యాయం! పడితే, వురిశిక్ష పడి వూరుకుంటుంది. అదృష్టం బాగుండి, అధికారి గాని కనికరించినాడంటే బొంకోలు కట్టేయ్యడం ఖాయం...నే చెప్పాను చూసుకో. ఫలానినాడు అన్నా వందుగాని...

"అదృష్టవంతుడయితే జామీను మీదనే వొదుల్దురు!"

"యేమో! కోటయబాబు నాచ్చికంమీద మోసున్న దంట కేసంతానూ."

"అవున్రోయ్. అన్నట్లు ఆఖరి సాక్ష్యం కోటయదే కాదూ. పద పద. విందాం."

[ కోర్టులో ]

బంట్రోతు:— ఉష్! సైలెన్సు. మాట్లాడకండి!

* * *

[ కోర్టు వరాండాలో ]

బంట్రోతు:— "పిట్టల కోటయ్యగారూ!
పిట్టల కోటయ్యగారూ!!
పిట్టల కోటయ్యగారూ!!!"

కోర్టుగుమాస్తా:—

"దేముని యెదట—

"దేముని యెదట —

"ప్రమాణంచేసి —

"ప్రమాణంచేసి—

"నిజం చెబుతాను —

"నిజం చెబుతాను —

"అబద్ధం చెప్పను —

"అబద్ధం చెప్పను —"

జడ్జి:— ఆఖరిసాక్ష్యం పిట్టల కోటయ్యగారిది. ప్రాసిక్యూషన్ తరఫు వాదన కానివ్వండి.

ప్రాసిక్యూషన్ ఇనస్పెక్టరు:— ఏమండి కోటయ్యగారూ! గోపాలంగారు పిల్లవాణ్ణి చంపివేశారు కదండీ?

కోటయ్య:— చిత్తం, అవునండి.

ప్రా. ఇ:— పిల్లవాణ్ణి తీసుకువెళ్తూంటే మీరు చూశారు కదండీ?

కోటయ్య:— చిత్తం, చూశానండి.

ప్రా. ఇ:— కోలాటంభజనదగ్గిర మీరూ ఉన్నారు కాదూ?

కోటయ్య:— నేనూ ఉన్నానండి.

ప్రా. ఇ:—గోపాలంగారు ప్రతియేడూ శక్తిపూజ చేస్తారుగదండి?

కోటయ్య:— చేస్తారండి.

ప్రా. ఇ:— గోపాలంగారు శక్తికి నరబలి యివ్వటం మీరు ఎరుగుదురు కదూ?

కోటయ్య:— చాలాకాలంనించీ పుకార్లున్నాయండి.

ప్రా. ఇ:— అయితే, కామేశ్వరి కొడుకుని తీసుకెళ్ళి, అమ్మ వారికి బలివేశాడనేకదూ?

కోటయ్య:— చిత్తం. అంతేనండి, మరి. పిల్లవాడికోసం తెగ వెతికామండి ఎఖ్ఖడా దొరక లేదండి.

ప్రా. ఇ:— ఇదుగో, ఈ రక్తపు మరకలున్న చొక్కా ఆ కుర్రా డిదే కదండీ?

కోటయ్య:— అవునండి. ఇదే, ఈ చొక్కే వేసుకున్నాడండి, కోలాటంలో.

ప్రా. ఇ:— గోపాలంగారిల్లు సోదా చూశినప్పుడు - మీరు పంచాయితీలో వున్నారుకదూ?

కోటయ్య:— చిత్తమండి. నన్నూ ఒక పంచాయితీ దారుగా వేసుకున్నారండి.

ప్రా. ఇ:— ఈ చొక్కా, ఈకత్తీ గోపాలంగారి గదిలో, మీ యెదటనే కదండి, తవ్వి తీశారూ?

కోటయ్య:— చిత్తం. అప్పుడు నే నక్కడే వున్నానండి.

* * *

జడ్జి:— ముద్దాయీతరఫు ప్లీడరుగారు ఇంకా యేమైనా అడ గాల్సివుంటే అడగవచ్చు.

ప్లీడరు:— ఏమండీ, కోటయ్యగారూ! గోపాలంగారికీ మీకూ ఈ మధ్యని నేస్తం చెడిందికాదూ?

కోటయ్య:- నేస్తం చెడ్డ మేమిటండీ. మేమూ, ఆయనా రైస్ మిల్లు వ్యాపారస్థులమేనండి.

ప్లీడరు:- గోపాలంగారి మిల్లువల్ల మీ మిల్లుకి నష్ట మొస్తూంది కదండీ ?

కోటయ్య:- అదేమన్న మాటండి! యెవ ళ్ళదృష్టం వాళ్ళది. ఆమాట కొస్తే, మా మిల్లువల్ల వారికే దెబ్బండి.

ప్లీడరు:- గోపాలంగారు పిల్లవాణ్ని స్వయంగా చంపుతూవుంటే మీరు చూశ్శేదుగదండి ?

కోటయ్య:- అయ్యో ! ఏమిటి మీ చేదస్తం. ఒకళ్లు చూస్తుండగా చంపుతాట్టండీ ?

ప్లీడరు:- అదుగో ఆ మడతమాటలే వొద్దంట. నీకళ్లతో నువు చూశావా, లేదా ? చెప్పవయ్యా.

కోటయ్య:- నేను చూడకపోతే యేమిటండి. భగవంతుడు లేడటండీ. బాబూ, ఇలాటి ఘోరాలు దాగవండి.

ప్లీడరు:- మరయితే, చంపేశి శవాన్నేం జేశాడంటారు ?

కోటయ్య:- అయ్యో బాబూ ! మళ్ళీ రెండోకంటి వాడికి కన బణ్ణిస్తాట్టండీ? దేవికి నైవేద్యంపెట్టి ఆరగించేశాడేమోనండి.

జడ్జి:- ఏమిటయ్యా ! నరమాంసమే తిన్నాడంటున్నావ్ ? పోనీ, ఆ యెముకలన్నా దొరకొద్దూ ?

కోటయ్య:- అమ్మమ్మమ్మా ! నరమాంసం అనకూడదండి. దేవి ప్రసాదమండి. యెమికల కేంటండి, ఎక్కడ పారేసినా, పాయె.

ప్లీడరు:- ఏమండీ కోటయ్యగారూ, కళ్ళారా చూడలేదని అంటున్నారుకదా, మరీ - గోపాలంగారే చంపేశారని ఎల్లా చెప్పగలరూ?

కోటయ్య:- అదేనండి మాయ! పిల్లవాణ్ణూ, ఆయనా వారి గుమ్మంలోకి వెళ్ళేదాకా చూశామండి. ఆ పైనేం చూడగలమండీ?

ప్లీడరు:- మరయితే, ఆ వెంటనే మీరు జనాన్ని పోగుజేసుకెళ్ళి, గోపాలంగారింటిమీద పడి ఆయన్ని చావగొట్టారు కదూ?

కోటయ్య:- అయ్యోబాబూ! అదేంటండీ. నేను కోలాటందగ్గిర నిలుచునుండగా, గ్రామస్థులి కెలా తెలిసిందోగాని అందరూ పోగడి అల్లరి చేశారటండి.

ప్లీడరు:- సరేకానీ - గోపాలంగారు పిల్లాణ్ణి ఎత్తుకు పోవటానికిన్నీ, జనం వెళ్లి అల్లరి చెయ్యడానికిన్నీ అట్టే వ్యవధి లేదు కాదటయ్యా!

కోటయ్య:- లేకపోవడ మేమిటండి! సుమారు ఒక జామయినా ఐవుంటుందండి. కామేశ్వరమ్మ గోలెత్తిన తరవాతనే కదండీ, వీళ్ళంతా బయల్దేరిందీ?

[ నర్సిగాడు, కామేశ్వరి కొడుకు ]

నర్సిగాడు:- కోటయబాబూ! కోటయబాబూ!

జడ్జి:- ఎవరా పోలికేకలు!

నర్సిగాడు:- కోటయబాబూ!

కుర్రవాడు:– అమ్మోయ్! అమ్మోయ్!! అమ్మోయ్!!!
ఒకడు:– అదేటి, కుర్రాడు ఆవిడవాళ్ళో దూరతాడెందుకూ!
కామేశ్వరి:– బాబోయి, నా కొడుకోయ్! బతికెల్లా వొచ్చావురా, నా తండ్రీ!! నా బాబూ!!
నర్సిగాడు:– బాబూ! కోటయబాబూ! ఇదుగో బాబూ మీ కుర్రోడు...వుండండే ఏంజేసినా? ఎల్లిన కాణ్ణుంచి వొకటే పోరు, వొకటే గోల, పెసాదం ముట్టడు. సూడుబాబూ, కంకై పోనాడు. పదివొరాలిచ్చినా సరే, నే బరించలేను బాబో. నా వొల్లకాదు.
జనం:– అరెరె. కామేశ్వరమ్మ కొడుకర్రా!
జనం:– కామేశ్వరమ్మ కొడుకూ...
జనం:– కామేశ్వరమ్మ కొడుకూ...
జనం:– కామేశ్వరమ్మ కొడుకూ...
జనం:– అవునవునూ, కామేశ్వరమ్మ కొడుకే...
జనం:– మన కామేశ్వరమ్మ కొడుకూ (కోలాహలం)
బంట్రోతు:– సైలెన్స్. గోల చెయకండి.
జడ్జీ:– ఎంతఘాత! ఎంతఘాత!! కాస్తంత ఆలస్య మయితే...
జనం:– దేముడిలాటి మారాజుని యెరక్కపోయి కారు కూతలు కూశినాం.
జనం:– గోపాలంబాబు పాదాలమీద పడదాం, పదండెహె!
జనం:– ముందీ కోటయ్యగాణ్ణి కాళ్లూ శేతులూ కట్టి పడెయ్యాల రండి, రండి.

జనం:- కొంపలు తీసే కొరివి! ఈడి దుంప తెగా...

జనం:-ఈలాటి వాణ్ని నరికి నాలుగ్గుమ్మాలా కట్టినా పాపం లేదురా.

జనం:- తుండితుండేలుకొట్టి కాకులికీ గెద్దలకీ యెగరెయ్యాల.

జనం:- వీడి మొహం చూస్తే, పంచమహాపాతకాలూ చుట్టుకుంటాయి, థు!

జనం:- గోపాలంబాబు సత్తెమే ఆయన్ని కాపాడింది.

జనం:- దేవిని నమ్ముకున్నవాళ్ళ కెప్పుడూ కొరుపు లేదురా.

జనం:- లేదు, యెప్పుడూ కొరుపు లేదు.

[ సమాప్తి ]

# పాత్రలు

ఆవిడ
ఆయన
జానకమ్మ
కమల
శేషగిరి

తారకం
పిల్లవాడు
చంటిబిడ్డ
రిక్షావాలా

జనం — మూక

# రిక్షావాలా

## రంగం: ఒక బస్తీ

( ఇంట్లో దంపతులు )

ఆమె:- ఏఁవండీ, చెబుతూంటే మీకాక్కాదూ ?

ఆయన:- అవున్లే...నన్నేం చెయమంటావ్, మధ్యని...

ఆమె:- ఆ జానికెమ్మగారు పాపం, అల్లంత దూరాన్నించి సాయంగా వచ్చి, పిలిచి వెళ్లింది. వెళ్లకపోతే యేఁవను కుంటారూ...

ఆయన:- వెళ్లమన్నానుగా నిన్ను ?

ఆమె:- నన్ను మీరు వెళ్లమనేదేఁవిటీ! మిమ్మల్ని కూడా వెంటబెట్టుకు రమ్మని మరీ మరీ చెప్పిపోయిం దావిడ.

ఆయన:- మాటంటే సులువుగా అనేశావుగాని, ఆఫీసులో సెలవు దొరకొద్దూ? నన్నొదిలేద్దూ యివాల్టికి...

ఆమె:- తెలుసు లెండీ, మీ వేషాలూ మీరున్నూ. నేను పుట్టినాట్నించీ వెళుతున్నారు ఆఫీసుకి, ఒక్కనాడు మానేస్తే యేమో!

ఆయన:- దొర లాఫీసే...

ఆమె:- ఆ ... దొరలైతే వూడిపడ్డారు గామోసు ... వాళ్లు మాత్రం మనుషులుకారూ ... వాళ్లకి మాత్రం పెళ్లాం బిడ్డలు లేరూ...మీకు చేత గాకపోతే, నే చెప్తాస్తా నుండండి.

ఆయన:- సరిలే. అదే తరవాయిగా వుంది...అయినా, ఆడ వాళ్ల నోములికి మొగాళ్లెందుకూ ?

ఆమె:- ఎందుకా ! ఇది మరోటీ మరోటీ కాదు. నందికేశ్వరుడి నోఁవంటే ! ఎంత ప్రయత్నమో, యేమిటో యేఁవన్నా తెలుసూ ? చేసుకున్న పదార్థాలన్నీ చూరు దాటకుండా చెల్లిపోవాలి. మరి వోచ్చీ, పోసీ అంటే శూద్ద రాళ్లకి పడెయ్యకూడదు ... కాస్తంతయినా మిగిలిపోవటానికి వల్లకాదు. అదంతా అణాపైసల లెఖ్ఖ...ఇవన్నీ యేం తెలుస్తయి మొగాళ్లకి ?

ఆయన:- అయితే, ఇంక తప్పనిసరే ?

ఆమె:- ఎలా తప్పుతుందండీ ? రేపు మళ్లీ మనం పిలిస్తే వాళ్లు రావాలా,యివాల్టితోనే సరా ? ఈ యింటి కా యిల్లెంత దూరమో ఆ యింటి కీ యిల్లూ అంతే దూరం.

ఆయన:- అబ్బ! తలిచినంతా చేసితీరతారు, ఈ ఆడవాళ్లు...

ఆమె:-విసుక్కోకండి. ఏదో నేరక 'సరే' అన్నానుగానీ... ఈ పూటకి కాస్త మాటా మాణిక్యం దక్కించండి.

ఆయన:- ఉఁ ! సరేలే. పద...ఎంత త్రోస్తే అంతే.

ఆమె:- ఊహుఁ మూలుక్కుంటూ రెందుకూ? శుభఁవా అని ప్రసాదం పుచ్చుకోవటానికి వెళుతూ, ఈ విస విస లేవిటీ అంట. నానోట పరుష వాక్యాలు పలికించకా...

పిల్లవాడు:- ఏఁవే, అమ్మా ! ఇంకా యెప్పుడే ?

ఆమె:- నే నేం జెయనూ, మీా నాన్నగారు ఆడారచ్చప్ప లాగ ఇల్లు కదల్రలూ...యేమండీ! పోనీ మేఁవన్నా వెళ్లొస్తాంగానీ, బండీ మాటాడుకొద్దురూ, కుర్రా ళ్లిహాశ రిస్తూన్నారూ...

ఆయన:- వొక్క నిమిషం వుండూ...ఇలా యెండ మండి పోతూంటే...

ఆమె:-ఉహ్! ఉండిపోదులెండి. నేనే పిల్చుకొస్తా...ఆమాత్రం సుష్ఠయిన మొగుడయితే నేనూ నలుగురిలాగ్గానే వుందును...



ఆవిడ:- ఏయ్, రిక్షా!

—యేఁవం డమ్మా?

—యెక్కండి కండి, దొడ్డమగోరూ!

—పోరా యెతవా, అమ్మగోరు నా బండేకాని యెక్కరు!

ఆవిడ:- ఎందుకర్రా, పడిపోయినట్టు పదిమందీ కట్టగట్టు కొస్తారూ? మాకు మామాలుగా వొచ్చే తాతిగాడు లేడూ?

—ఆడూరి కెళ్లినాడండి.

—రొండు నెల్లదాకా రాడండమ్మా.

—నా బండెక్కి సూడండి, ఎంచ క్కెల్తదో...సరికొత్త లబ్బరి టైర్లండి...

ఆవిడ:- గోపాలస్వామి గుడిదగ్గిర కెళ్లాలి...

—అల్లాగ్గేనండి. రోపాయన్న రిప్పించండి. మినిట్లో తీసకెళ తాను.

—వొక్క రూపా యిప్పిస్తారా దొడ్డమ్మగారూ? యెండ నెత్తి మాడిపోతావుందండీ...

—బేరా లేటి రాండమ్మా, వొక్కటే మాట, పదణా లివ్వండి, యెక్కండీ.

—వొరే మనిసిని సూశి మాటాడుకోరా.

ఆవిడ:— యేఁవిట్రా! దిష్టిపెట్టినట్టుగా ఎందుకల్లా పిల్లలకేసి యెగా దిగా చూస్తావ్?

—ఎంతమందం డమ్మా!...అమ్మగారు, బాబుగారూ... వొకటి-రెండు-మూడు-నాలుగు మొత్తం...

ఆవిడ:— చూశారా! కన్ను పొడుచుకున్నా కానీ కనపడని రోజుల్లో వీళ్ళ కెంత నిర్లక్ష్యంగావుందో...బస్సు లొచ్చి పొట్టకొట్టినా వీళ్ళకింకా బుద్ధి లేదేం?

—అమ్మా! జనం సాలా వుండారు. పోలీసు వోళ్లు సూస్తే పట్టుకుంటరు. రెండుబళ్ళు కట్టించండమ్మా.

ఆవిడ:— పోరా భడివే! సొమ్ము యేఁవంతమురిగిపోవటం లేదు. వెళితే నలుగురం ఒఖ్ఖ బండిలోనే వెళ్ళాలి. లేకపోతే మానేసుకుంటాం.

—వొరే రాఁవిగా! అమ్మగోరు ఆగ్గురం పడతావున్నారు. సెప్పేహ, బేరం...

—ఆళ్ళతో శేటి. ఆఖరుమాట పావలాయిప్పిచ్చెయ్యండీ.

ఆవిడ:- అఖ్ఖర్లే. బండీ దొరక్కపోయినప్పుడు చూస్తాలే.

—లేదండమ్మా, పావలాకి తక్కువ లేదండి.

ఆవిడ:- నాలుగు ఫర్లాంగులు నిండా లేదు. ఈ భాగ్యానికి పా-వ-లా కావాలేం? ఎండగా వున్నదనికానీ, నాలు గడుగులు నడిచేపోదుం...ఇదిగో చూడు. రెండణాలిస్తాం. అక్కడ దిగవిడిచి రావటానికే... మళ్ళీ తరవాత పేచీ పెడితే నే వొప్పుకునేదాన్ని కాను. తెలిసిందా? రెండ ణాలు, అంతే.

—శానాదూరం వుండాదమ్మా, మూడణాలిప్పించెయ్యండి, తల్లీ!

ఆవిడ:- ఇంకో అర్ధణా యిస్తా...ఊఁ ఫది కాన్లకి పయిన దమ్మిడీ ఇచ్చేది లేదు. యిష్టముంటే రా, లేకుంటే ఫో...

—లేదండమ్మా మూ-డ-ణా.. మీరు దిగదుడిచిపారే శినపాటి లేదూ...

ఆవిడ:- సరే, కానీ..

♦ ♦ ♦

ఠంగ్ - ఠంగ్ - (గంట ధ్వని)

హేఁయ్, హేఁయ్య్!!

[ రిక్షాలో వెళుతూ ]

ఆమె:- హుష్! అబ్బా...నిప్పులు చెరిగేస్తూంది, దిక్కు మాలిన యెండ...ఏం చెమట, యేం చెమట! యేఖ కాలవలు కట్టేస్తూంటే ..

ఆయన:- దానికి తోడు ఘూళుపు కూడాను. ఆ చెవి నించి ఈ చెవి కొట్టుకుంటూంది...చూడు, చూడు. ఆ చెట్టు మీద పిట్ట లెల్లా పడిపోతున్నాయో...

ఆమె:- కాదూ? రోహిణి కార్తికి రోళ్ళు బద్దలవుతా యంటారు...మాటలా! అయినా, మనుషుల బుద్ధుల్ని పుచ్చుకునే ఎండ లిల్లా మండుకు పోతున్నాయి. మా కాలంనా డిల్లాటి యెండలు యెన్నడైనా ఎరుగుదుం?

ఆయన:- కలి ప్రథమ పాదంలోనే ఇటువంటి ప్రళయాలు...

ఆమె:- ఆఁ...లేకపోతే పాటక జనానికి ఇంత పొగరేఁవిటి చెప్పండీ ..

ఆయన:- నిజఁవే ..పోకిరీలు.

ఆమె:- అబ్బే, ఓ మూల దేవుడు వీళ్ళ నిల్లా వొంచబట్టి గానీ నాలుగు వేళ్ళూ లోపలికి పొయ్యే మా టుంటే అసలు నిలుస్తారా, భూమ్మీద...

ఆయన:- ఛ. నిలవడఁ వేమిటీ...పట్ట పగ్గాలే ఉండవ్.

రిక్షావాలా:- ఠంగ్ ఠంగ్ !!

హేయ్ హేయ్!! (ధ్వని)

—బాబయ్యా తమురు కూంతయెనక్కి సరకాయిచ్చండీ.

ఆయన:- అబ్బ! బొట్టనమోపుగా కూచున్నా "ముందుకి రా, వెనక్కి పో" అంటాడు, అస్తమానఁవున్నూ.

ఆమె:- వీళ్ళ కున్నదే యిది...

ఆయన:- పోనీ, వాడు చెప్పినట్టు రెండు బళ్ళూ చేయించుకున్నా తీరిపోను...

ఆమె:- ఊరుకోండి యెవళ్ళన్నా వింటే నవ్విపోయ్యేరు. కళ్లు మూసుకుంటే క్షణంలో వెళిపోతాంగదా ఇంతలోనే ఆపసోపాలు పడిపోతారు, మరిన్నీ. ష్! అబ్బా! దిక్కుమాలిన యెండ...ఎవళ్లూ భరించలేరు నా తల్లీ!

—ఏయ్, నిన్నే...పో జోరుగా...అడుగెయ్యి...

ఆయన:- ఎందుకొచ్చిన తొందర? వాడిష్టంవొచ్చినట్టే పోనియ్యకూడదూ! పాపం, వాడూ మనలాంటి...

ఆమె:- నే నిందాకానే చెప్పలా! టక్కరి వాళ్ళీ బండీవాళ్లు. జరుగు రన్నప్పుడే జాగు చేస్తారు. చూడండి, అడుగులో అడుగేసుకుంటూ...ఎంత చెప్పినా, ఊఁ?

[ చప్పట చరిచి ]

ఏంరా, చప్పున పదమంటూ వుంటే నీక్కాదూ?

"ఠంగ్ ఠంగ్ ఠంగ్

హేయ్ హేయ్ తప్పుకో" ( ధ్వని. )

ఆయన:- అలా అనేస్తావుగానీ, భగభగమంటూ ఈ యెండలో...

ఆమె:- ఉహూఁ! కనికరం...పాపం జాలిగుండె! ఎండయితే ముసుగేసుకుని హాయిగా యింట్లో పడుక్కోమనండీ...

ఆయన:- ఇల్లూ వాకిలీ కూడానా, వాడి బతుక్కి...!

ఆమె:- వాళ్ళకి యెండేవిటి, కొండేవిటి? అ-ల-వా-టూ... వాళ్ళు పుట్టిం దెందుకూ, మరి...?

ఆయన:- అయినా, వాడమ్మకడు బ్బంగారం గానూ, ఇంత కన్నా ఏం పరుగులెడతాడూ?

ఆమె:- ఈ కబుర్లన్నీ నా దగ్గిర మానెయ్యండి. బండి కుదర్చటానికి నే నుండబట్టిగానీ... లేకపోతే తెలిసొచ్చును పంతులుగారి పస...

ఆయన:- ఛ్! రామచంద్రా...( నిట్టూర్పు )

"ఠంగ్ ఠంగ్"

రిక్షావాలా:- ఎటేపండి, అమ్మగోరూ?

ఆమె:- ఎడంపక్కకి మళ్ళు.

"హెయ్! హెయ్!
తప్పుకో...తప్పుకో..."

♦ ♦ ♦

[చెరువుగట్టున ఒక చెట్టు నీడని బండీ ఆగింది]

ఆమె:- హమ్మయ్య!యెప్పటికయినా.. ఈచెరువుగట్టునే .. దగ్గి రెక్కడో...శాశ్వతంగా ... కొంపేసుకుని, రెండు పెంకులు బోర్లించుకోవాలి మనం. యేవంటారు?

ఆయన:- అవు నల్లాగే. ఎదట రెండు రావి మొక్కలు కూడా పారేశామూ అంటే ..పదేళ్ళయేటప్పటికి పక్షిజాతులు యావత్తూ వచ్చి వాలుతూంటాయి.

ఆమె:- ఆఁ!...ఊరివాళ్ల పశువులొచ్చి బతకనిచ్చి నప్పటి మాట కద.

ఆయన:- బతకనివ్వకపోతే, బందెలదొడ్లో పెట్టించమూ? డొక్కచించి డోలు కడతాంగాని,— వూరుకుంటాములే,

అల్లా వెర్రి పడతావ్...కా-నీ! ఇక్కడ జాగా కొన
గలమా, అని...

ఆమె:- కొన లేకపోవడ మేఁవిటి...యింకా ఎగువ దక్షిణంవే
పైతే, చవగ్గా వున్నాయిట పెరళ్లు. మీరు నిఘామీద
వుంటే సరి.



[ మళ్లీ బండి బయల్దేరింది ]

రిక్షావాలా:- ఇంకా యెక్కడండమ్మా?

ఆమె:- ఒక్క పది గజాలు అసింటా పదరా...

రిక్షావాలా:- ఏం దమ్మా, గుడి దగ్గి రంటివి. ఎక్కడి గుడీ...
ఎక్కడి లోకం...?

ఆమె:- అహా...ఇక్కడే, నాలు గడుగులు...వొచ్చేశాం...
పద, పద...

రిక్షావాలా:- పావలాకి తక్కువ పుచ్చుకునేది లేదు...
"ఠంగ్ ఠంగ్ !!"
"హేయ్ — హేయ్ !!!"

ఆమె:- అదుగో, ఆ లాంతరున్న గుమ్మందగ్గిర ఆపరా అబ్బీ!

రిక్షావాలా:- అల్లాగ్గే నండి...



[ బండి ఆగింది ]

ఆమె:- కుర్రాణ్ణి కాస్త అందుకోండీ...
— ఇందరా, అబ్బీ.

రిక్షావాలా:-యేందమ్మోవ్, రెండణాలియ్యబోతవు. గుడిదగ్గిర, గుడి దగ్గి రని శెబితివే, ఇక్కడి కయితే పావలా...అ-అ...

ఆమె:- ఇచ్చిం దేదో ముందు తీస్కో. తరవాత చూస్తాం...

[ రిక్షావాలా బేడకాను చావిడిమీద గిరా టేస్తాడు. ]

ఆమె:- ఏఁవిట్రా దారుణం...పోఫో...ఒక్క దమ్మిడీకూడా యివ్వను...దిక్కున్న చోట చెప్పుకో...!

ఆయన:- వాడే పాయిరి, పాపం!-ఇంకో అర్ధణా పారేద్దూ...

ఆమె:- ఉహుఁ...ఒక్క గుడ్డిగ వ్వొచ్చేది లేదు...చూస్తారేం, ఆ బేడకాసు తీసుకుని లోపలికి రాక...?

రిక్షావాలా:- అమ్మగోరూ ! ఇక్క డెంత సేపవుతదండీ ? వచ్చిం దాకా వుండమంటారా, పొమ్మంటారా ?

ఆమె:- అయితే, రానూ పోనూ ఏం పుచ్చుకుంటావ్ ?

రిక్షావాలా:- హాఁ!...తమ దగ్గిర బేరా లేటండమ్మా .. తోశిం దిప్పించండీ...     [వెకిలి నవ్వు.]

ఆమె:- ఒక్క ఘంట సే పుండగలవూ?

రిక్షావాలా:- ఓ...

ఆమె:- పదండీ, లోపలికి...ఎలా లొంగొచ్చాడో చూశారా? వీళ్ల నెంతసేపూ బొటనవేలికింద మట్టుపెట్టి వుంచాలి గానీ, లేకపోతేనా...అమ్మో! గుండా పిండీ కొట్టెయరూ? -పెద్దవా ళ్లూరికే చెప్పారా !...



[రిక్షావాలా బండిలో పడుకుని, అప్పుడప్పుడు గంట మోగిస్తూ, పాడుకుంటూ వుంటాడు.]

*"జట్కా లెల్లే సక్కానిదాన*
*సెకున్కా సెదరక కూకున్నావు,*
*ఒడుదుడుకులా బండీ గొడ్డూ బడితే*
*నలిగిపోయీ సీర సిరిగిపోతదీ...." **

♦ ♦ ♦

[జానికమ్మ గారింట్లో నందికేశ్వరుడి నోము సందడి; వచ్చేవాళ్ళూ ...వెళ్ళేవాళ్ళూ...ఫలహారాలు చేసేవాళ్ళున్నూ, వడ్డన చేసే పళ్ళేలూ, గరిటెలూ చప్పుడు.]

జానికమ్మ:– అబ్బే, అసలు వేసిం దేదీ...మీా రల్లా మొహ మాట పడితే వొప్పుకోం. ప్రసాదం పారెయ్యకూడదని చెప్పి, మొదట్లోనే కొంచెం వడ్డించా.

శేషగిరి:– మా తారకం వున్నాడేండి, పిన్నిగారూ! వాడికి అసలు యింటిదగ్గిరే తగని మొహమాటం(వండీ...

కమల:– మొహమాటాలన్నీ యింట్లోనే దాచుకోవాలి. పై కొచ్చేటప్పుడు పట్రాకూడదు...

శేషగిరి:– (నవ్వి) బాగా చెప్పావు తల్లీ.

జానికమ్మ:– బాబూ, గిరీ! ఒక్క అట్టుముక్క. కొంచెం పచ్చడట్టుకొచ్చి వడ్డించమ్మాయ్.

శేషగిరి:– యేంవిటండోయ్, కొత్త కొత్త గమ్మత్తులన్నీ చేయించారు?

కమల:– ఇదీ...రహస్యం...నోరు తెరిచి తినగూడదు, నోరు విప్పి చెప్పకూడదు...

---

* శ్రీ ప్రయాగ నరసింహశాస్త్రిగారి రచన.

శేషగిరి:- భేష్, భేష్.....వహ్వా.....వారే తారకం! స్టూడెంట్సుయొక్క అంతర్యం తెలుసుకున్న వారొక్క పిన్నిగారేన్రా. ఎటువంటి 'ఐడియా'వో చూశావ్?... యుగయుగాల్నించి జరుగుతూ వుందికదా ఈ నోము, ఆఁ? ...వొక్కళ్ళకయినా తట్టిందీ, ఇల్లాటి అనుపానం పెట్టాలని?

తారకం:- బ్రదర్! కనిపెట్టావో లేదో గానీ, క్షీరాన్నంలో చాలా కొత్తదనం కనబడుతూంది. ఇందులో పడిన దినుసులూ...

శేషగిరి:- రైట్. దొరికోచ్చావ్. రీసెర్చి స్టూడెంటు వైనందుకు.. నీజన్మ ఇవేళ సార్థకమైందనుకో. హా-హా-హా-హ్హా.

తారకం:- దానిమాట కేం గాని....అట్ల విషయంలో ఇంత మృదుత్వం ఎట్లా వచ్చిందంటావ్?

శేషగిరి:- అదంతా ఆ పిండి 'కాంబినేషన్'లో వుండే మజా.

తారకం:- నో-నో. నువ్వు చెప్పిందీ వొక కారణమే ఐ వుండొచ్చు. అంతమాత్రాన నాలిక్కి తగిలేసరికల్లా కరిగి పొయ్యే గుణం ఎలావస్తుందిరా. సరి, ఇది నెమ్మదిమీద ఆలోచించాల్సిన సమస్య.

జానికమ్మ:- నాయనా, తారకం! వొక్క గరిటెడు పరఁవాన్నం...

తారకం:- అబ్బబ్బా, పిన్నిగారూ! ఇదే యెక్కువైపోయింది. మరి వేస్తే దిగబెట్టెయ్యడఁవే...

జానికమ్మ:– ఎక్కువయింది ముందు పుచ్చేసుకోండి.

కమల:– కష్టపడి తింటే కడుపుకి మంచిది...కానివ్వండి.

తారకం:– అలా అంటే కాదు. తీరా వేశారని తింటున్నా కానీ...

కమల:– కాదు, కాదు. మీరు తింటున్నారని వేశాంగానీ...

శేషగిరి:– బలే. ఫిట్టింగ్ రిప్లయ్! (అందరూ నవ్వు.)

జానికమ్మ:– కొంటి కొక్కిరాయ కబుర్లు చెప్పడానికి మా కమలం తరవాతనే. యేఁవిటోయ్ తారకం! బొత్తిగా పిట్టాహారం...రాళ్లు తిని హరాయించుకోవలసిన యీడు కదా...

శేషగిరి:– పోనీ, బ్రదర్! మెత్త మెత్తగా ఉన్నాయని మెచ్చుకుంటున్నావు గనక, ...ఒక్క అట్టుముక్క పలకరించి చూడూ. పచ్చడి వేయిస్తాలే...

కమల:– మీ అంత చప్పున మెత్తబడరంటోయ్, తారకం గారు. (అందరూ నవ్వు)

జానికమ్మ:– మరి వడ్డించ న్లెండి. వేసినమట్టుకి సొమ్ము చేశేస్తిరా, అంతే చాలు.

కమల:– అమ్మా, ఇంకా యేపాటి మిగిలి పోయ్యాయే?

జానికమ్మ:– ఆఁ...గుండిగా క్షీరాన్నమూ అల్లానే వుండి పోయింది. రెండు పళ్ళేల నిండా అట్లున్నాయి...ఎప్పటికి చెల్లనో, యేమో...

కమల:– బెంగెట్టుకోకూ, అవే చెల్లిపోతాయి.

జానికమ్మ:- కాలేజీపిల్లలొచ్చారు కదా, ఓ పట్టు పడతా రనుకుని సంబరపడ్డాను.

కమల:- అబ్బే. వుత్తుత్తి గొప్పలే...యేం లాభం లేదు.

శేషగిరి:- తారకం! షేమ్. షేమ్...కాలేజీ కంతటికీ కళంకం తెచ్చావురా, భాయ్...

తారకం:- భోక్తాంశ రమ్మంటే వస్తుందిటోయ్. పెట్టి పుట్టాలి గాని!

కమల:- అయితే, అమ్మా! మరో పాతికమందొస్తే మాట దక్కుతుందా?

జానికమ్మ:- అవును గాని, అల్లా మెరకవీధి కెళ్ళి, రాజేశ్వరమ్మగార్ని పిల్లల్ని దగ్గిరుండి తీసుకురా.

కమల:- అబ్బా, ఎన్ని మాట్లేఁవిటీ...కాళ్ళడి పోతూను... ఎండ యెలావుందో చూశావా?

జానికమ్మ:- అమ్మవు కావ్! మా బంగారు తల్లివి కావూ? ఇదుగో, మళ్ళీ నువ్వొచ్చాకేం...?

శేషగిరి:- పిన్నిగారూ! ఇన్నీ చేశారు గానీ, కొంచెం మంచినీళ్ళందుకున్నారు కాదు...

జానికమ్మ:- అ-య్యో, అవునండోయ్, అమ్మాయీ! మన వారికి మంచితీర్థం పెట్టావుకావు కదా! నువు చూస్తున్నావని చెప్పి నే నూరుకున్నా నాయిరి...మా చెడ్డ దుడుకు పిల్లండి ఎల్లాబతుకుతుందో యేమో గానీ...

శేషగిరి:- భయపడకండి పిన్నిగారూ, మెత్తటి మొగుడే దొరుకుతాడు లేండి.

[ తలుపు తట్టిన చప్పుడు. ]

జానికమ్మ:- అమ్మాయ్, చూశిరా, ఎవరో వచ్చినట్టుందీ...

[ కమల వెళుతుంది. ]

శేషగిరి:- అబ్బ! రాత్తిరికి మరి భోజనాపేక్ష లేకుండగా...

జానికమ్మ:- ఈ మాత్తరానికే?

తారకం:- రాత్తిరికే కాదురా, మూడు పూటల దాకా...

జానికమ్మ:-ఏదో, శ్రమిచ్చినందుకు...పాపం...మాట తీసె య్యకుండా...

శేషగిరి:- పిన్నిగారూ, మా కెప్పుడూ మీరు ఇటువంటి శ్రమ కలిగిస్తూవుండాలి ...

జానికమ్మ:- ఇదుగో, స్తిమితంగా కూచుని, తాంబూలాలు వేసుకోండి, నాయనా!

శేషగిరి:- మా తారకం బ్రహ్మచారండి. వేసుకోడు. కొంచెం పనుందీ. మరి, వెళ్ళొస్తామండి, పిన్నిగారూ!

జానికమ్మ:- ఇంకా యెవరైనా ఎరిగున్న వారుంటే పంపించండేం బాబూ!

శేషగిరి:- అయ్యో! ఆ మాట చెప్పాలా? తప్పకుండా పంపిస్తాం. తీరా కాలేజీకి సెలవు లిచ్చేశారుగానండీ...

  

[ బండీవాడి పాట వినవస్తూవుంటుంది. ]

"పైరుల బండీ వైరులెస్సు లాగ
తారురోడ్డుపైన దొర్లిందంటే
కడుపులో సల్ల కదలాకుంట
నడుపుతా కూకో రిక్షాబండిలో...."

[కాస్సేపయిన తరవాత]

ఆమె:- వెళ్ళొస్తానండి, వదినా!

జానికమ్మ:- మంచిదమ్మా. ఏదో ఎండనకుండా పిల్లలూ మీరూ వొచ్చారు, మాట దక్కించారు. నిజంగా ఇవేళ సంకురాత్తిరి పండగలా వుంది.

ఆమె:- ఆఁ... యేఁవిటో లెండి. ఒహాళ్ల కొహాళ్లం ఈ మాత్రం ఆసరా గాకపోతే యెల్లా ... మీ అన్నగారికి యిల్లు కదలడమంటే బ్రెహ్మప్రళయం.

జానికమ్మ:- ఉద్యోగంచేసే మగవారికి పాపం తెరిపుండద్దూ...

("ఠంగ్-ఠంగ్-ఠంగ్!" ధ్వని.)

ఆమె:- అదుగో, పొద్దు వాలిందా! బండీవాడు తొందర పడుతున్నాడు. మరి, వెళ్లొస్తా వదినా...ఉండండి. ఎప్పుడన్నా వద్దామంటే బొత్తిగా దూరాభారమై పోయింది.

జానికమ్మ:- క్షేమాన్ని వెళ్ళి, లాభాన రండి.

కమల:- దొడ్డమ్మగారూ!

"చాలా చాలా దయ వుంచీ,
చల్లకుండలో వేలెట్టి"

[ అందరూ నవ్వు. ]

♦ ♦ ♦

" ఠంగ్—ఠంగ్—ఠంగ్—ఠంగ్ !
ఠంగ్—ఠంగ్—ఠంగ్—ఠంగ్ !
హేయ్...హేయ్ ! "

ఆమె:- ఒరేవ్, కాస్త నెమ్మదీ...

రిక్షావాలా:- ఇందాక జోరుగ పదమంటివిగదమ్మా...సూసో, నా పోర్సు...

ఆమె:- చెబుతూంటే నీ క్కాదుట్రా? మనిషివా, పశువ్వా?

రిక్షావాలా:- " ఠంగ్—ఠంగ్—ఠంగ్—ఠంగ్ !
,,—,,—,,—,,
హేయ్—హేయ్—హేయ్—హేయ్,
ఠంగ్—ఠంగ్—ఠంగ్—ఠంగ్ ! (ధ్వని)

ఆమె:- వీడి వాలకం చూస్తే తాగొచ్చినట్టుంది గానీ...

♦ ♦ ♦

[ కొంతదూరం వెళ్ళాక రిక్షాబండి గోడని తాసుకుని, కాడి తేలిపోయి, దభీమని బోల్తాకొట్టింది. ]

ఆమె:- బా—బో—య్ ! (కేక)

పిల్లవాడు:-నాన్నా! నాన్నా!! (గొంతుక చించుకుని యేడుపు)

చంటిబిడ్డ:- ( గుక్కపెట్టి గోల )

జనం:- అరెరే, దొర్లిపోతున్నాదిరా, పాపం!

జనం:- ఎంతమనిషిరా నాయనా, పర్వతంలాగ !

జనం:- బలే, బందోబస్తుగా పెరిగిందిరా, యిల్లాలు.

ఆయన:- (వొగురుస్తూ) వొస్తున్నా నుండేవ్, లేవదీస్తాను.

జనం:- ఏమిటండీ, గొడవ?

జనం:- ఏం, ఎవరికయినా దెబ్బలు తగిల్నయా?

జనం:- అయ్యో, పాపం! అసలు ఎట్లా పడ్డారు చెప్పండీ?

ఆయన:- దుర్మార్గుడు...కావాలని చేసిన పనండీ, యిదీ... యెముక లిరగ్గొట్టాలె, గాడిద...

ఒకడు:- అస్సలైనవి రెండిచ్చి పంపండి, పంతులుగారూ!

ఆయన:- ఇదిగో, కేసు పెడతానుండు, గాడిదకొడకా! (చప్పట చరిచి) డొక్క మాడి, దేవుడో అంటూ చద్దువుగాని, జెయిల్లో...

మరొకడు:- జయిల్లో పెట్టిస్తే బుద్ధి రాదండి, బాబూ! అత్తింటల్లుడిలాగ తిరిగొత్తా డాడికేం?

ఆయన:- అది కాదండీ, జరిగిన వృత్తాంతం వినీ...ఎవడివల్ల పొరపాటుంటే, వాడి నోట్లో యింత గడ్డిపెట్టించండి. పెద్దలూ...

మరొకడు:- ఆలోశిత్తవేటి...శూర్పణకి కోసినట్టు ముక్కూ శెవులూ వూడగొట్టవయ్యా, మొండిశికండిగోడికీ...

ఆమె:- యేమండీ, హాయ్యో!! వాళ్ళపాలైనా పౌరుషం లేదేం పాపంవండీ! అల్లా దణ్ణం పెట్టి ఊరుకోవడమేనా?

ఒకడు:- మగాడవ్ కావంటయ్యా పంతులూ? రోసం పంతం లేదూ? ఇంతపని చేసినోణ్ణి...

మరొకడు:- వొరేయ్, ఈవిడగారికి బొత్తిగా కూరలో మిరపకాయ యేరి పారేసినట్టేరా, మొగుటంటె ..

[ ఆయన జామ్మని మీదికి ఎగేసుకువెళ్ళి, సత్తువపూనా తీసి పెట్టి బండీవాడిని ఒక్కగుద్దు బణాయించాడు. ఆ మట్టున నలుగురూ అందుకుని నాలుగు చేతులూ వేశారు. రిక్షావాలా స్మృతి తప్పి కింద పడిపోయ్యాడు. ]

జనం:- చాలూ, చాలూ...

జనం:- ఈణ్ని కొడితే తక్కినోళ్ళకి బుద్ధి రావాలి...

జనం:- పోనీయవయ్యా, బేమ్మడా! ఆడి పాపాన ఆడే పోతాడు...

జనం:- అయినా పెద్దమనిషి అని పేరెట్టుకుని బండివాడిమీద చెయి జేసుకోవడ మేఁవిటీ!

ఆమె:- మొదణ్నుంచీ మీరు కొమ్ము లివ్వబట్టే, వాడికి కళ్లు నెత్తిమీది కొచ్చాయ్.

ఆయన:- లే. లే...మనఁ విప్పుడు జట్కాబండి చేయించుకు వెళ్ళాలి.

ఆమె:- జ – ట్కా – లో – నా? అమ్మయ్యో!! ఎంతవుతుందీ!... ( ఏడుపు. )

ఆయన:- ను వ్విప్పు డెంత అసహ్యంగా ఉన్నావో తెలుసా? వొళ్ళంతా బాడి...ఉండుండు. చీరకూడా చిరిగినట్టుందీ... ఇంకా నయం...లేచిన వేళ...

ఆమె:- వే శేఁవిటీ...ఆ తెలికల తట్ట ఎదురైనప్పుడే అనుకున్నా నేను...ఏదో మూడుతుందిరా భగవంతుడా అని.

ఆయన:- ముందు మొహంమీది దుమ్ము దులుపుకో...తరవాత యింటికెళ్ళి సావకాశంగా మాటాడుకుందాం.

ఆమె:- శాస్త్రయిందా బాగా? మొహం మంటెట్టా...అద్ది డబ్బు లివ్వకుండా తప్పిపోయింది లెండి...

[ జట్కాబండి వచ్చింది. ]

ఈ జటకాకి యెంతేఁవిటండీ?

ఆయన:- చెప్తా, ముందు యెక్కు, ఊఁ.

ఆమె:- ఎంతసొమ్ము, యెంత సొమ్ము! గంగపాలు, నేల పాలు! హాయ్యో! సరికొత్త బనారసు చీరండీ! ఒక్క మాటయినా కట్టుకో లేదండీ...ఎంత చక్కటిచీరో! ఏడి చేతు లడిపోనూ ..

♦ ♦ ♦

రిక్షావాలా:- ( లేచి, వొళ్ళు దులుపుకుని, బండి రెండు చేతులా పట్టి, గంట గణగణ మోగించాడు. )

మా దొడ్డ యిల్లాలు...మా గొప్పబేరం! ఆమారాజే కూంత నయం సల్లని మాటయినా సెప్పేవోడు, కడుపు నిండేది. హా!! మా దొడ్డ యిల్లాలు రాతకొద్దీ దొరికింది. సాఁవంతులు యేం జేసినా సెల్లిపోతది!! హా! తెల్లారి లెగిశి, మా గొప్పబేరం! మా దొడ్డ యిల్లాలు !!



# పాత్రలు

| | |
|---|---|
| ఔరంగజేబు | ఢిల్లీ చక్రవర్తి. |
| ముఅజమ్ | చక్రవర్తి కొడుకు. |
| రాజసింహుడు | రాఠోర సంస్థానాధీశుడు, చక్రవర్తికి అంతరంగిక మిత్రుడు. |
| శైలిని | రాజసింహుని తనయ. |
| హీరోజీ ఫర్జంద్ | నకలు శివాజీ. |

---

(ఇతివృత్తం: శ్రీ ఆలంపురం రాజు బి. ఏ.)

వెనక శివాజీకి నకలు శివాజీ కూడా ఉండేవాడట. ఆతని సాయంతో శివాజీ ఎల్లాంటి అద్భుతకార్యాలు నిర్వహించే వాడో ఈ చిన్ని నాటిక చమత్కారంగా నిరూపిస్తుంది.

# నకలు శివాజీ

## ఒకటవ రంగం

[ శైలిని మందిరం ]

:— ' శైలినీ! శైలినీ!! ' ( తలుపు చప్పుడు. )

శైలినీ:— ఎవరు చెప్మా...

రాజసింహుడు:— నేనే నమ్మా, చిట్టితల్లీ!

శైలిని:— నాన్నగారూ, ఊళ్లో వుండికూడా... మీ దర్శన భాగ్యం కొత్తిగా కరువైపోయింది కదా! రెండురోజు లైందో లేదో మిమ్మల్ని చూసి. అప్పుడే రెండు వుష్కరాలు దాటిపోయినట్టుంది.

రాజసింహుడు:— అవును తల్లీ! రాచకార్యాల్లో మునిగివుండ టంవల్ల...యెక్కడా తీరికన్నమాట కనపడటం లేదు. పాదుపాలదగ్గిర వుద్యోగమంటేనే అంత.

శైలిని:— నాన్నగారూ, ఏమిటి విశేషాలూ ?

రాజసింహుడు:— విశేషాల కేమున్నాయి. ఈ వృద్ధాప్యంలో నువు నా కోర్కె తీర్చకపోవటమే గొప్ప విశేషం!

శైలిని:— మీరు సుఖంగా వుంటే, అదే నాకు పదివేలు. ఈ కోరికను అంగీకరించకపోవటం మీ అసౌఖ్యానికి కారణ మెట్లా అవుతుందీ ?

రాజసింహుండు:— అమ్మా! నువ్వు మొగల్ సామ్రాజ్యపు రాణివి కావడం నాకెంత సంతోషాన్ని కలిగిస్తుందో కాస్త యోచించూ?

శైలిని:- నాన్నగారూ! ఆ దుర్గతిమాత్రం నాకు వద్దు. ఊహుం వద్దుగాక వద్దు. మొగల్ చక్రవర్తి భార్య నవడంకంటె ఒక సామాన్యపు హిందూపౌరునికి తొత్తుగా జీవనం గడప టమే నా కభిలాష.

రాజసింహుడు:- అమ్మాయీ! పి-చ్చి-దా-న !! చక్రవర్తిని వరించే భాగ్యం ఈ భారతదేశంలో నీకు తప్ప మరెవరికీ సాధ్యపడుతుందీ ? చక్రవర్తికి మామగార్నని అనిపించు కోవడంకంటె నాకీ జన్మలో కోరదగిన గౌరవం వే రేమి టుంటుందీ !!

* శైలినీ! ఇలా చూడు. సామ్రాజ్యపాలకుల రాజ కుటుంబాలికి చెందిన బంధువులమూ అంటే మన కెంత కీర్తి! ఎంత ప్రతిష్ఠ!! ఊఁ ? ఇటువంటి సిరి వొందులు కొని, ఎవడో సామాన్యపు రాజపుత్రుణ్ని వరించటం...

శైలిని:- నాన్నగారూ! మీ వంటి జ్ఞానవృద్ధులే ఇట్లా మోహంలో పడిపోయ్యారంటే, నేనేం బదులు చెప్పేది ! అక్బరు చక్రవర్తికి కన్యక నిచ్చిన రాజపుత్ర కుటుంబానికి యేమంత గౌరవం హెచ్చిందో చెప్పండి. రాజా మాన సింహుని పుత్రిక సలీముని పరిణయం చేసుకుని యేం ప్రఖ్యాతిని పొందిందో సెలవియ్యండి. ఇప్పుడు ఔరంగజేబు పత్ని ఐనటువంటి ఉదయపుర రాజపుత్రి, కంటికి మింటికి యేకధారగా విలపించటం మీ రెరగని విషయమా ?

ఎవరి గొడవో యెందుకు. ఆ ఔరంగజేబు బంగారు సంకెళ్ళకు చేతు లప్పగించిన మనకు ఏమి యశస్సు వచ్చి ఒరిగింది? తండ్రీ! ఈ విషయంలో నన్ను నిర్బంధించ కండి. నా యిష్టం వచ్చినవాణ్ని వరించనీయండి.

రాజసింహుడు:- కాదు. నీకు చిన్నతనం. అజ్ఞానంలో పడకు. నే చెప్పేది విను. ఔరంగజేబు జ్యేష్ఠపుత్రుడు ముఅ ్మ్ కంటె యోగ్యుడైన వరు డెవ్వడూ నీకు లభించడు. అతని పాణిగ్రహణమే మన వంశోద్ధరణ. తెలిసిందా?

శైలిని:- నాన్నగారూ! ఇహ దాపరిక మెందుకూ? నా మనసులో మాట నోరు తెరచి చెప్పివేస్తాను. మీా రెట్లా భావించినా సరే. నేను హిందూ రాజాధిరాజును తప్ప మరొకరిని పెళ్లాడను.

ఆ మహారాజుని చేరక...ఏనాడు మనం మన సంస్థాన స్వాతంత్ర్యాన్ని మొగలులకు బలి యిచ్చామో, నాడే మన వంశం కళంకిత మయిపోయింది!

రాజసింహుడు:- ఎవ రేమిటీ...ఆ హిందూ రా-జా-ధి-రా-జు!!

శైలిని:- ఇంకెవరు, శివాజీ మహారాజ్! 'ఛత్రపతి' శివాజీ మహారాజ్...

రాజసింహుడు:- శైలినీ! పెంకిపట్టు పట్టకు. మహారాష్ట్రులు శూద్రులు.

శైలిని:- అవును. నాకూ తెలుసు. ముసల్మానులు మ్లేచ్ఛులు.

రాజసింహుడు:- హాఁ! నిన్ననవలసిన పనేమిటి తల్లీ! నిన్ను

దూషించి ప్రయోజనం లేదు. ఏనాడయితే నిన్ను నాతో 'ప్రతాపగడ' తీసుకువెళ్ళానో, ఆ నాటినుంచీ నీ మనస్సు చలించిపోయింది.

సరి, సరి. బహుశా, ఆ సమయమందే చూచి వుంటావు, ఆ 'కొండ యెలక'ని! అమ్మా! ఆ మరాఠీ మావటివా డెక్కడ? రాజపుత్ర కన్యక వయిన నువ్వెక్కడ?

శైలినీ! ఒక్క విషయం ఆలోచించుకో. సాక్షాత్ భారత చక్రవర్తికి పెద్దకుమారుడూ, విక్రమ సంపన్నుడూ అయినటువంటి ముఆజమ్‌ను వరించి, దేవేంద్రభోగ మనుభవించడమో? లేదా చక్రవర్తి కోటలో బంధితుడై వున్న ఆ శూద్ర మరాటుకి ప్రేమపాశాల్లో తగులుకుని...

శైలిని:- ఏమంటున్నారూ? శివాజీమహారాజు... చక్రవర్తికి బందీగా చిక్కాడా! ఆఁ? ఆఁ? చెప్పండి నాన్నా, వేగిరం...

రాజసింహుడు:- అబ్బే. లేదు తల్లీ! లేదు. నేనట్లా అన్నానా?...నా కిప్పుడూ...మనస్సు...కొంచెం వ్యాకులంగా వున్నదీ...అంచేతనూ, అటువంటి మాట యేదయినాదొర్లిందో, యేమో. అంతే. మరి, నేను వెళ్లొస్తాను.

## రెండవ రంగం

[ మేడమెట్లు ఎక్కిన చప్పుడు ]

శైలిని:- ఏమిటా హడావిడి! చక్రవర్తిగారి ముద్దుల కొడుకు తుప్పుతూ తూలుతూ వస్తున్నాడు. వాలకం చూస్తే...

పానశాలకి పోయి పూర్తిగా పట్టించినట్టే వుంది. ఆయన వెంట మా తండ్రి కనబడడేం? ఉపద్రవమేదో రాబోయ్యే టట్టుంది. ఇక యిక్కడ వొక్క క్షణమయినా ఒంటి పాటుగా వుండకూడదు.

అదుగో, ఆ రెండుచీరెలూ ఒకదానికొకటి ముడేసి... ఒక కొస స్తంభానికి కట్టి...రెండో కొస వెంట కిందికి జారి పోతాను. ఈ వెన్నెల ఉండగానే గబగబ కాలు సాగించి మహారాష్ట్ర శిబిరం చేరుకోవాలి.

## మూడవ రంగం

ముఆజమ్:- ఏదీ! నా ముద్దుల శైలిని యేదీ!! హ. హ్హా. శైలినీ! భారత చక్రవర్తికి రాణీ! యెవరూ లేరులే. సిగ్గెందుకూ! ఇదుగో, నువ్వు మంచిగా రాకపోయ్యావంటే హుఁ, యేం జరుగుతుందో తెలుసా! మీ నాయన మాకీ హుకుం ఇచ్చేసినాడు. బలిమిని ప్రేమించమని. హే! ఖబడ్దార్ !!

అరె. ఏ గదిలోనూ కనబడ్డేరా. దాగిలిమూతలు గానీ ఆడ్తావుందా యేఁటి! సరి. మేడామీఁదా పోయి సూశీవస్తాం.

బలే చిత్రంగా వుందే. శిల్కా యేడకో హుడాయించీ వేసింది. పంజరం ఖాలీ సేసి పారీపోయిందే! అరే, అల్లా!

ఉఁ! యెక్కడిక్కీ పోతాదిలే. ఆ కొండ యెల్కాగాడి మకామ్కా పోయి సూస్తాం.

## నాలుగవ రంగం

[ మహారాష్ట్ర శిబిరానికి వెళుతూ, దారిలో ]

శైలిని:- ఓయ్, చందమామా! ఇంతన్నా బొత్తిగా కనికరం లేదేం నీకూ? నీ కోసమని 'రోహిణి' దగ్గిర దగ్గిరసా చేరిన కొద్దీ నువ్వు ఎడమెడంగా మేఘాల్లోనించి తప్పించుకుని తిరుగుతావా? ఇది నీకు న్యాయమేనా?

చూడు, మాఁవా! నా ప్రియుడు సరిగ్గా నీలాగే వుంటారు. నీలాగే ఆయన సౌమ్యమూర్తి, సౌందర్య మూర్తి, శాంతమూర్తి.

ఛీ! ఈ సామ్యం బాగుండలేదు. నీ కాంతి క్షీణించి నట్టే, ఆయన ప్రేమకూడా తగ్గిపోతుందా యేమిటి చెప్మా! కాకుంటే... మొన్నటిరోజున ఏనుగుమీద దర్బారుకు వేంచేస్తున్నప్పుడు... నా పేరు చెప్పి, చెలికత్తెచేత హారతి పంపిస్తే... 'శైలిని యెవరూ?' అని ఎందు కడగాలీ! కిటికీ కటకటాల్లోంచి కళ్ళారా నన్ను తొంగిచూచీ కూడా, ఏమీ యెరగనట్టు ఎందుకు నటించాలీ?

మ-న-సా! భ్రాంతి చెందకు. నా ప్రాణవల్లభుని ప్రేమ పర్వతమువలె అచంచలమైంది!

ఢిల్లీనగరమా! ఇక నిన్ను మళ్ళీ చేరబోను. నీ ధర్మాంధతకూ, నీ రాజతంత్రాలకూ, నీ దుష్కార్య కౌశలానికీ ఒక్క నమస్కారం. హైందవస్వాతంత్ర్యాన్ని అపహరించి, రాజపుత్రుల సువర్ణ కారాగారమై ఒప్పే టటువంటి నీకు ... నేను అధీశ్వరిని కాజాలను. ఇంతకంటే శివాజీ మహారాజుకి పాదదాసినై, సుఖజీవితం గడుపుతాను.

## ఐదవ రంగం

ఔరంగజేబు:- రాజసింహా! ఇప్పు డప్పుడే పదిగంటల రాత్రైనా, మన ముఆజమ్ ఇల్లు చేరకపోవడం చూస్తే, నాకు మనస్సు చాలా కలతగా వున్నది. బోనులో బిగింపబడిన ఆ 'కొండ యెలక' దారి చేసుకుని పారిపోయిందేమోనని కూడ అనుమానం తోస్తూంది.

రాజసింహుడు:- అట్లా ఎన్నడూ జరగనేరదు. ఫాదుషాహీ! తమ కా సంశయ మెందుకూ, నేను స్వయంగా శివాజీ శిబిరానికి వెళ్ళివచ్చి, యెలికకు విశేషాలు విన్నవించు కుంటానుగా!

## ఆరవ రంగం

[ మహారాష్ట్ర శిబిరం ]

ఫర్జంద్ (నకలు శివాజీ):- శైలినీ! ఈ అర్ధరాత్రివేళ వచ్చా వెందుకూ యిక్కడికి?

శైలిని:– .........

ఫర్జంద్:–ఎందుకు వచ్చావూ? ఈ శ్రమంతా ఎందుకు శైలినీ?

శైలిని:– ఎందు కొచ్చానా? మీ క్షేమం విచారించటానికీ, చక్రవర్తి కృత్రిమాన్ని మీకు తెలియజెప్పడానికిన్ని.

ఫర్జంద్:– అం–తా...కృత్రిమమే...(నిట్టూర్పు)

శైలిని:– మా తండ్రి అనాలోచితంగా చేసిన కృత్యముకూడా..

ఫర్జంద్:– హూ ! అందరూ అనాలోచితమైన పన్లే చేస్తారు. శైలినీ! నువ్వూ...నేనూ.. అందరమున్నూ...

శైలిని :– నే–ను...నే–ను ...... అనాలోచితంగా., చేసిం దేమిటి ?...

ఫర్జంద్:– న–న్ను...నన్ను ప్రేమించడమే, శైలనీ! నన్ను క్షమించు నన్ను మన్నించు. నే చేసిన అపరాధం... .. నోరార...చెప్పలేను. చూడూ, శైలినీ ! ఈ కాగితం నీకు పంపాలనే వుద్దేశంతో వ్రాసి వుంచాను. ఇదుగో, తీసుకుని చదువుకో.

——ఎవరా వచ్చేది ?...

ముఅజమ్:—— ఎ–వ–రా ? నీకు సింహస్వప్నమైనటువంటి ఔరంగజీబు చక్రవర్తికి జ్యేష్ఠపుత్రుడు !... తెలిసిందా ?

ఫర్జంద్:– సరి. వచ్చిన దారినే మళ్లు. ఊఁ...జాగు చేస్తి వంటే ఈ ఖడ్గం నీరక్తాన్ని బలికోరుతుంది...ఛలో జావ్!

[ తరుముకుని వెళ్ళును. ]

ముఆజమ్:- (పరుగెత్తి బయటికి వచ్చి) అరేయ్, తలుపు లన్నీ బిగించివెయ్యండి. బంద్ కరో!

[ తలుపులు మూసే సందడి. ]

రాజసింహుడు:- ఏమిటీ గడబిడ? అయ్యో, మా యువరాజు ప్రాణాలకే మోసమా? ద్రోహి! ద్రోహి!! వారే, చూస్తారేం! శిబిరానికి నిప్పు ముట్టించెయ్యండి.

[ అగ్నిజ్వాలలు – ఘోష. ]

ముఆజమ్:- అయ్యో! అయ్యో!! శైలిని లోపలనే వుండి పోయింది... వెళ్ళూ వెళ్ళూ! తియ్యా!

రాజసింహుడు:- ఏమిటీ? శైలినా! నా శైలినే! అయ్యో! అయ్యో! తల్లీ! శైలినీ!! శైలినీ!!! వొస్తున్నా...

[ పరుగెత్తి వెళ్ళి దహించుకుపోతున్న శిబిరం ప్రవేశిస్తాడు. ]

## ఏడవ రంగం

భస్మీపటలమైన శిబిరంవద్ద

[ ప్రవేశం ఔరంగజీబు ]

ఔరంగజీబు:- నాయనా, ముఆజమ్! ఏమిటీ గోల! అంతా ప్రళయంగా అగుపడుతూందే?

ముఆజమ్:- శివాజీన్ని, శైలినీ మాటాడుకుంటూ వుండగా నే నిక్కడికి వచ్చాను, తండ్రీ! ఆ కొండయెలక కత్తి ఝుళి పించి నన్ను ఇవతలకు తరిమి కొట్టాడు.

ఔరంగజేబు:- ఆఁ?— ఏ—మి—టీ !

ముఆజమ్:- బయటికి వచ్చి, ద్వారాలు యావత్తూ బంధించి వేశాను. ఇంతలో మన రాజసింహుడు వచ్చి శిబిరానికి అగ్నిస్పర్శ చేయటమే మం దన్నాడు.

ఔరంగజేబు:- భేష్, భేష్ ! అచ్చా...

ముఆజమ్:- పాపం శైలిని లోపలనే ఉండి పోవడం జ్ఞాపక మొచ్చి, కేకలు వేశాను. ఆ కేకలు విని, రాజసింహుడు అమాంతంగా జ్వాలల్లోకి దుమికాడు, మరి తిరిగి రాలేదు.

ఔరంగజేబు:- హావురా, ఎంత పని! ఎంత పని! బుగ్గి ఆరిపి, ఆ శవాల్ని బయటికితీయమనూ. (ధ్వని.)

ముఆజమ్:- ఇవిగో, మూడు మూర్తులూ...స్పష్టంగా... శైలిని మృదుహస్తాలు చెక్కు చెదరకుండా ఎట్లావున్నాయో! పాపం! అయ్యయ్యో !...

ఔరంగజేబు:-కొండయెలక పూర్తిగా సచ్చిందిరా, నాయనా? అవును గాని, శైలిని చేతిలో ఏదో కాగిత మున్నట్టుందీ, చూడు ?

ముఆజమ్:- అవును, ఇ దేదో వుత్తరమే, మూల మూలల్ని కొంచెం కాలిపోయి వుంది.

ఔరంగజేబు:- అదేమిటో తీసి చదువు. ఇట్లా దగ్గిరసా రా. ఊఁ...

[ ముఆజమ్ చదువును. ]

" శైలినీ !

ఒకటి రెండుసార్లు నిన్ను 'ప్రేయసీ!' అని సంబో ధించినందుకు క్షమించు.

"నువ్వు నీ తండ్రితో ప్రతాపగడ దుర్గానికి వచ్చిన నాటినుండీ ఈ పాపబీజం నా హృదయమందు వృద్ధిచెందు తూనే వున్నది. ఆనాడు పూల తోటలో నీ లావణ్యాం చూచి, ముగ్ధుణ్నయి, విరహిణి ఐన వనదేవత వలె ఉన్న నీతో ప్రేమ సంభాషణ చేసినాను.

నేనే శివాజీ నని భ్రమపడి నువు నన్ను ప్రేమించావు. నా దేహము, రూపము, ఆకారము, వర్ణము, సర్వమూ అచ్చ శివాజీ రాజును పోలి ఉంటవి. ఏదయినా ప్రమా దం వచ్చిన సమయమందు వారి స్థానమున నన్ను పెట్టి, శివాజీ ప్రాణరక్షణ చేసుకుంటున్నారు.

ఆనాడు దిలేర్ ఖానుతో వ్యవహరించింది నేనే. యుద్ధ మందు శివాజీకి ప్రేటు తగిలి శిబిరానికి పోయినట్టయితే రణరంగమున నేనే సైనికులకు ప్రోత్సాహం కలిగిస్తూ వుంటాను. ఈ రోజున శివాజీ తప్పించుకొనిపోయి, ఇతరు లకి అనుమానం తోచకుండా వారి శయ్యమీద నన్ను పరుండి ఉండమని ఆజ్ఞాపించి వెళ్ళారు.

శైలినీ! బ్రహ్మ హత్యకూ, పత్నీ హత్యకూ, ఇంత కంటే ఘోరమయిన మరే పాతకానికయినా ప్రాయశ్చిత్త మున్నదేమోకాని స్వామిద్రోహానికి మాత్రం ప్రాయ శ్చిత్తం లేదు. లేదు, లేదు, లేదు.

ఆజన్మాంతమూ వివాహ మాడ నని శివాజీ మహా రాజు ఎదట నేను శపథము చేసి వున్నాను. నేను నిర్వ హించవలసిన రాచకార్యాలకు అవసర మయినందువల్ల రాజు నా వద్ద ఇటువంటి శపథము కైకొన్నాడు.

నేను స్వామిద్రోహిని, నిన్ను మోసపుచ్చాను. వంచిం చాను. ఐతే...నిన్ను పాణిగ్రహణ మొనర్చానే కాని, నీ పరిశుద్ధదేహాన్ని అపవిత్రం చేయలేదు.

శైలినీ ! నన్ను క్షమించు...క్షమించు...నన్ను మరి చిపో.. ఎవరిని చూచి నువ్వు శివాజీ అని భ్రాంతి చెం దావో ఆ ప–ర–మ–పా–పి ఐన ఈ హీరోజి ఫర్జంద్ అనే మహారాష్ట్రుణ్ణి పూర్తిగా మరిచిపో !

నువ్వు నన్ను మరిచిపోవడమే నన్ను క్షమించినట్టుగా భావిస్తాను.

—హీరోజి ఫర్జంద్."

ఔరంగజేబు:- అరే ముఆజమ్ ! అల్లా ! ! ఏమిటీ లేఖా ! ఖరాబ్ ! రాచసింహం సచ్చిపోయిందీ ? నాకీ కుడిచెయ్యి విరిగిపోయింది...ఇంకేం రాజ్యం ! ఇంకేం జీవనం ! ఇంతా చేసి...ఆ భడ్వా కొండా యెల్లా తప్పించుకు పోయినాడు, సూడు. అరే, అల్లా ! నేను అప్పుడే అనుకున్నాను. ముఆజమ్ ! హాస్సల్ మనిషీ వదిలేసి, అరే ! నీడా పట్టుకు వేళ్ళాడాం. ఎంత పని–ఎంత పని !!

## పాత్రలు

| | |
|---|---|
| కృష్ణారావు | రావుబహద్దరు |
| బంగారయ్యగారు | జమీందారు |
| పంతులు | బంగారయ్యగారి గుమాస్తా |

బంగారయ్యగారి నౌకరు.

---

* మద్రాసు రేడియో ప్రసారితము.

# పూ జా రి

**[ పంతులు యిల్లు ]**

పంతులు:- ఒహెూహ్హోహ్హోహ్హో! రావు బహాదరుగారే! ఏమిటి మా భాగ్యం...అరె, కేవలం పాదచారులై దయ చేస్తున్నారేమిటీ...'ఊరకరారు మహాత్ములూ' అన్నారు పెద్దలు ... ఇవాళ, నిజానికి మా గృహం పావనమై పోయిందండీ.

కృష్ణారావు:- పంతులూ, నీకు నాయందుండే భక్తి గౌరవాలు మాటలతో కాదు. క్రియలో చూపించాల్సిన సమయం వచ్చింది. ఇదుగో చూడూ, మీకూ, మాకూ వుండు కున్న స్నేహం...మన తాత, ముత్తాతలనాటినించీ వస్తూ న్నది కానీ, ఇవాల్టిదీ నిన్నటిదీ కాదు సుమీ.

పం:- అహాఁ, ఎంతమాట సెలవిచ్చారూ... తాతయ్యగారి తరంలో...తమకు బొత్తిగా బాల్యం లెండి...ఎన్ని కార్లు, ఎంత హోషు!...ఆ రోజుల్లో విమాన మెక్కిన మగాడు ఆయన తప్ప మరెవరున్నారండీ?... అబ్బ!... ఆ జనమూ ఆ ధనమూ...కన్నులవైకుంఠం కుబేర పీఠం...హాఁ! అట్లా వుండేది గనకనే...తమరు యెన్నికల్లో నిలిచీ...గెలిచీ... తాతయ్యగారి పేరు ప్రతిష్ఠలు నిలబెట్ట గలిగారు.

కృ:- ఆ పరిస్థితులన్నీ జ్ఞాపకంచెయ్యకు పంతులూ. తాతయ్య నాటినించీ మా కుటుంబ వ్యవహారాలు యావత్తూ నీకు తెలియనే తెలుసు. వేరే విడమర్చి చెప్పేదేమిటీ...

పం:- అబ్బే చెప్పకక్కర్లేదు...తాతయ్యగారి పేరు బలిమి యేమిటోగానీ, అదృష్టజాతకం...అమృతహస్తం ..అన్నీ అల్లానే కలిసొచ్చాయి—— ముగ్గురు కొమాళ్ళకూ మూడు లక్షల నగదు...వంతు పెట్టారూ అంటే ఎంత ప్రజ్ఞ! ఓహోహో...

కృ:- ఇదుగో, నువ్వు పాతపురాణాలన్నీ పైకి తవ్వావంటే నాకు కడుపు తరుక్కు పోతూంది. ఎన్ని లక్షలయితే మటుకి ఆగుతాయి పంతులూ! ఇంటిపట్టున కూచున్న నన్ను...నలుగురూకలిసి పురెక్కించి యీలక్షన్లో దింపారు. ఈ వూబిలో యెప్పుడైతే పడ్డానో ఆ క్షణంనించీ నా దేవతార్చనా, పారాయణా, రామకోటీ, పురాణగోష్ఠీ, అన్నీ యేట కొట్టుకుపోయినాయి. వీటిమాటకేం? తిండి పెట్టే తల్లి మాలక్ష్మి... వ్యవసాయం వేపే చూడటం మానేశానుగా.

పం:- కొట్టి పారెయ్యటానికి వీల్లేదండోయ్. రాజకీయాల్లో ప్రవేశించారంటే...ఆ దర్జా...

కృ:- దిక్కుమాలిన దర్జా, పోనిస్తూ, ఆ బోర్డన్నారు, ఈ బోర్డన్నారు. నోటుకి ఐదేసి అధమపక్ష మన్నారు. అదుగదుగో కాస్తంతలో తేలిపోతూంది ఛాన్సు అన్నారు... పంతులూ! యేం చెప్పమంటావ్ పంతులూ, చేతులో చెయ్యేసి వొట్టేసుకున్న వోటర్లు...నా ఉప్మా కాఫీలు తెగమేశారు. నా కారుల్లో షికార్లుకొట్టారు. నన్ను ద్రోహం

చేసి, నా నోట్లో కరక్కాయ కొట్టారు. ఈ దెబ్బలో...
మొత్తం లక్షాయేభై వేలూ మంగళంపాడేసింది. ఈగొడవ
యింక యెత్తకు పంతులూ, నీకు పుణ్యముంటుంది.

పం:- నిజమే, తమరు సెలవిచ్చినట్టు...యలక్షనూ...జూదం
తో సమానమయిపోతూంది.

కృ:- సముదాయింపులకేం గానీ ..నన్నొక వొడ్డుకి చేర్చవల
సిన భారం నీది... దేవుడి వరం పుచ్చుకున్నా, తక్కిన పని
కావ్హా, నీవల్ల...

పం:- నా వల్లనా,తమకు పని...కాకిచేత కబురంపితే చేతులు
కట్టుకుని వాలుదునే!

కృ:- పంతులూ, ఉన్నమాట చెప్పేస్తున్నాను. మనిద్దరిలోనే
ఉండిపోవాలి సుమా. ప్రెసిడెంటుగిరీ మనకు దఖలుపడు
తుందని నాడీ జ్యోతిష్కుడు చెప్పినమాట నమ్మి...పది
మందీ వస్తూ పోతూవుంటారు గదా అని చెప్పి ...కొత్త
బంగాళా కట్టించాను. ఇది కట్టిస్తూన్నప్పుడే మా మేన
మామ కొడుకు దగ్గిర పాతిక వేలు చేబదులు చేశాను.
ఆ టయిమ్‌లో మనల్ని పైవాళ్ళే పద్దూ పరకా అడిగే
వాళ్లు కాదులే...

పం:- అహాఁ నే నెరగనుటండీ! రావుబహదరుగారు బదులడుగు
తారా అని అందరూ ముచ్చట పడేవారు...

కృ:- పోయిందిలే. ఆ దశ తిరిగిపోయింది...మన వ్యవహారం...
కొంచెం లుగసాన పడ్డంతోనే, పంతులూ! అందరికంటే

ముందుగా మా వాడే వో_త్తిడి చేయటానికి ఆరంభించాడు. యదార్థం నీతో చెప్పొద్దూ... ముక్కా చెక్కా లేదు కదా, ఏ డెక్కడికి పరుగె_త్తబోయాడులే అని ధీమా పడి...కొంచెం...ఉపేక్షచేసి వూరుకున్నా వూరుకునే సరికల్లా...మా వాడు టపీమని దావాపా రేసి, డిక్రీపొందే శాడు. ఇప్పుడది అమలుకొచ్చి నె_త్తిమీద కూచుంది.

పం:- అరరె...ఎంత పని, యెంతపనీ...

కృ: పంతులూ, నువ్వు తేలిగ్గా ఆలోచిస్తే కాదు. ఈ డిక్రీ బాకీ కట్టెయ్యకపోతినా...మన మేడా గీడా...కొ_త్త బంగాళా...మామిడితోట, ఒకటేమిటీ...పిత్రార్జితమంతా, ఒకటోసారి, రెండోసారి, మూడోసారి...ఎగిరిపోతుంది.

పం:- తమవంటి ఘరానా మనుషులికి మర్యాదే ప్రధానం. చిల్లిగవ్వ బాకీ వున్నదీ అంటే, తీర్చి పారేస్తేగాని నిద్దర పోరు. అన్నట్టు, మొన్న మా ప్రొప్రయిటరుగా రింటికి వెళ్ళొచ్చినప్పుడు...ఈ విషయం ప్రస్తాపించినట్టుందీ?... అక్కడా అక్కడా ఒకటీ రెండు మాటలు చెవిని పడ్డాయి లెండి.

కృ:- అదేకాదూ చెప్పానూ...దేముడి వరం అయిందని?...

పం:- మా యజమాన్లు కూడా చెప్పారు లెండి, నాతో. అప్పటినించీ ఆలోచిస్తూనే వున్నా. ఎల్లాగరా భగవంతుడా, ఈ బ్రాహ్మడు చిక్కన పడిపొయ్యాడూ... బొ_త్తిగా సమయంతప్పివచ్చిందే, అని చెప్పి, సరిలెండి...

సాహసే లక్ష్మీ అన్నారు. ఒక్క సంచీ మనది కాదను కుంటే...కురుస్తాయి. నేను నిఘామీాదనే వుంటాలెండి. సర్దుబాటు కాకపోతుందా, రెండుమూాడు మాసాల్లో.

కృ:- మాసాలా? రెండు, మూడు మా—సా—లా? బంగా రయ్యగారిని నే నడిగే, రెండు నెలలు దాటింది. రేపు లేదు, ఎల్లుండి వుదయం పదకొండు గంటలకల్లా కోర్టులో సొమ్ము కట్టెయ్యాలె. మరి వాయిదా ఇవ్వబడదూ అని నిష్కర్షగా చెప్పేశారు, జడ్జీగారు. కట్టి తీరాల్సిందే.

పం:- చాలా గట్టి చిక్కే వచ్చిందే.

కృ:- నువ్వు నసిగితే కాదు పంతులూ...ఈ సమయంలో...

పం:- కాదండీ. మామూాలు సమయమైతే మీా రన్నట్టే... మా ప్రొప్రయిటరుగా రింట్లో మొన్నను వివాహ కార్యా నికిగాను.. ఖజానా శీదాగా ఖాళీ చేశామంటే నమ్మండి. పోనీ...రయితాంగాన్ని శిస్తు లడుగుదామని చెప్పి వెళితే నిన్న గాక మొన్ననేకదా, బాబయ్యా! కట్నాలూ, కాను కలూ సదివించినాము. వొక్క రెండు మాసాలు కాపుదల చేయిస్తేగాని లాభం లేదని గోల. వాళ్ళని రొక్కించ టానికి నోరు రాకుండా వుంది.

కృ:- పంతులూ! ఇవన్నీ చెప్పి లాభం లేదు. నిన్నే నమ్ము కున్నాను. నీదే భారం...

పం:- అవును. నే నేం చేసేది చెప్పండి? పదులూ, వందలూ అయితే, యెడంచేత్తో వసూలు చెయ్యొచ్చు. వేలలో

కావాలీ అంటే అంత సులువుగా అయ్యేసని కాదు, చూడండి ..అయితే రావుబహాదర్ గారూ! మరొక్క సంగతి మనవి చేస్తా. తమ వాయిదానాటికి మనదగ్గిర సొమ్ము యావత్తూ సమకూడిందా, ఇబ్బందే లేదు. కీడెంచి మేలెంచమన్నట్టుగా ఒక వేళ సమకూడనప్పటికీ— మీా రేం దిగులు పడక్కర్లేదు. మన మార్వాడీ పూర్ణ చంద్ వున్నాడుగా? తమరు వెళ్ళేటప్పుడు కొంచెం వాడి చెవిని వేసి వుంచండి, ఎందుకయినా మంచిది. ఆ పైన, నేనూ...ఈ సాయంత్రం కలుసుకుని మాటాడతాను.

కృ:- అయితే, ఇప్పుడు వడ్డీ లెట్లా?

పం:- వడ్డీలు మామూలేనండి. కాని, కమిషన్లు మాత్రం... అవసరాన్ని బట్టీ...తమకు తెలియని దేముందీ!

కృ:-ఏమిటి పంతులూ! కమిషన్లుకూడా తెచ్చిపెడుతున్నావే?

పం:- పోనియ్యండి, నాలుగు రోజు లూరుకుంటే సరి...మన యెస్టేటు దస్తే వసూలవుతుందాయిరి..... వీడే అన్న మాటేఁవిటీ.

కృ:- అద్గో...మళ్ళీ నాలుగు రోజులంటాడూ...ఆకాశం బద్ద లయి, నెత్తిమీాద పడుతుందని కాదుటోయ్, ఈ అహో రింపు అంతాను...

పం:- తమ రిల్లా తొందరపడుతున్నారనే...సర్దుబాటుకోసం, నాకు తోచిన మాట మనవి చేసుకొన్నా. కాని... నా మాట ఎంచేతనో తమకు నచ్చింది కాదు.

కృ:- కాదులే...అవసరమూ అని అనేసరికల్లా...యెవడో పల్లెటూరివాడి దగ్గిర కోసినట్టు, మన దగ్గిరకూడా యేనో కమిషన్లూ ఖమామిష్షులూ అంటున్నావులే...

పం:- అయ్యో రామా, నా వుద్దేశం తమకు గ్రహింపు కాలేదు. పోనీ, అదంతా ఎందుకండీ...లెఖ్ఖ నాలుగు రోజులు వోపిక పట్టుదురూ, నా మాట విని.

కృ:- మొత్తానికి బంగారయ్యగారి ఆఫీసుకి నువ్వు వుండతగ్గ వాడివోయి, పంతులూ! మణిపూసవి. హ్హం...సొంత సొమ్ములాగే చూసుకుంటున్నావే...

పంతులు:- ఇంకా పెరటిదారినే వున్నారు రావుబహదరుగారు! ...చెప్పవలసింది చెప్పాను, తరువాత తమ చిత్తం.

కృ:- అయితే, పంతులూ! నీవల్ల ఈ వ్యవహారం సాసా యింపు అవుతుందా? లేక, ప్రొప్రయిటరుగార్ని మళ్ళీ చూడాల్సి వుంటుందా?

పం:- సరాసరి తమరు యజమానుల్ని చూడటమే మంచిది. ఒక్క వ్యాపారంమీదనే దయచేయాలన్న మాటేఁవిటి... ఒకవంక స్నేహితం, అంతకు మించిన చుట్టరికం...

కృ:- చాల్లే. బాగుంది ధోరణి. నీ చేత ఈ పని ఎట్లా చేయించాలో...నాకు తెలుసు.

పం:-ఏదో...ఆశ్రితుణ్ణి...పుత్రవాత్సల్యం వుంచాలి, తమరు.

[ బంగారయ్యగారి బంగాళా ]

కృ:- అందులోనూ...మొన్న మనలోగిట్లో కార్యం అయిన దగ్గర్నించీ...లోకుల ఉత్సాహం చెప్పనలవి గాకుండా

వుంది...మీ యెదట పొగడటం కాదు గానీ...అదొక రాజసూయయోగమేనని జనవాక్యం...

బంగా:- ఏమిటో బావగారూ...మీ అభిమానం అలా అని పిస్తూంది కానీ...అంతకంటె మరేం లేదు. నమ్ముతారో లేదో మీరు. ఈ రోజుల్లో...ఘరానా మనుషుల సంగ తంతా...బంగారప్పిచ్చికలో బంగారం, నేతిబీరకాయలో నెయ్యీన్నీ ..

కృ:- నిండుకుండ తొణుకుతుందా...

బంగా:- కాదండోయ్. ఈ మధ్యనల్లా కార్యాల్లోనూ, కథ ల్లోనూ శివాలాడేసరికి కాళ్లు చల్లబడి వూరుకున్నాయి. ఇందులో వుండే విషమ చిక్కులు...ఒకంతట, చెబితే బోధపడేవి కావు.

క:- ఆం-బోధపడకపోవడ మేమిటీ? యమయాతన్లన్నీ ప్రత్య క్షంగా స్వానుభవమవుతూ వుంటే? రామయతండ్రీ... ఈ అప్పులబాధ మటుకు ... పగవాళ్ళకయినా వద్దండీ బాబూ!

బంగా:- చూశారా, అప్పు పుచ్చుకున్న బాధ మాత్రమే మీకు తెలుసు. అప్పు ఇచ్చినవాడి తిప్పలు...బావ గారూ, మీరు వినదలిస్తే, నెలల తరబడి కాశీమజిలీల్లాగ చెప్పొచ్చు. ఇదొకజూదపు ఆటంటే నమ్మండీ...సరే— కొంచెం పనిమీద పోయిరావాలి. మళ్ళీ కలుసుకుందాం.

కృ:- మిమ్మల్ని ఆలస్యం పెట్టన్లేండి. కా—నీ...మీ ఆప్త కోటిలోవాణ్ణి కావటంచేత...ఒక్క విషయంమటుకు దాచలేకుండా వున్నాను...మన పంతులున్నాడే...

బంగా:- ఏం, మీ పని సర్దుబాటు చేశాడా ?

కృ:- అదే.. అదే—చెప్పబోతున్నా. మొదట్లో ఇంతచేటు లేదనిన్నీ...కాని యిప్పుడిప్పుడు...దురాశ యెక్కువయిం దనీ, అటూ ఇటూ కూడా నింపుకొంటున్నా డనీ... గ్రామంలో...వదంతులు మోగిపోతున్నాయి...పాపం, గుళ్లో దేముడిలాగ ఆ ఆఫీసుగదిలో కూర్చుంటారు, మీ కేం తెలుస్తాయిలెండి, యివన్నీని.

బంగా:- బావగారూ, ఇన్నాళ్ళాయె, యెప్పుడూ చెప్పారు కారేం ? అరెరె...

కృ:- ఒకళ్ళ కడుపుమీద కొట్టడమంటే మనసొప్పదండీ, ఏదో మీ దగ్గిర అతగాడు ప్రవేశించిన వేళావిశేషం మంచి దయింది, ఓ యింటివాడైనాడు, కుటీరం వేసుకున్నాడు. పిల్లాజెల్లా...బాగానే వుంది. ఎవళ్ళయినా వృద్ధిగా వుండ టమే మనక్కావల్సింది ... కానీ తమరు స్వయంగా పుర మాయించిన నా విషయంలో ... పిడుక్కీ బియ్యానికీ ఒకటే మంత్రమన్నట్టు వ్యవహరించడం...

బంగా:- ఉండండి బావగారూ...పిలిపించి కనుక్కుందాం ! (కాలింగ్ బెల్ )—అరె, చూడూ, మన పంతుల్ని... అర్జెంటుగా రమ్మనమను.

నౌకరు:- చిత్తం.

బంగా:- పోసీ...గాదికింద మెలక, గాదికిందనే బతకాలిగదా అని చెప్పి...చూసీ చూడకండా వూరుకుంటున్న కొద్దీ...

కృ:- మీారల్లా, అదే పోయిరని వూరుకోబట్టే, తుంటరితనం బలిసిపోయింది. ఇంతకూ, అసలు కీలకం మనవిచేశా కదండీ.

[ పంతులు ప్రవేశం ]

బం:- ఏమోయి పంతులూ! మన రావుబహాదరుగారి పని ముందుగా చక్కబెట్టమంటే...

పం:- అదే చూస్తున్నానండి, పదులూ వందలూ అయితే... ఇట్టే మాటదక్కిపోను. కాని, బహాదరుగారికి వేల సంఖ్యలో కావాలంటున్నారు. రైతాంగంలో.. పీక గోసినా పైసా పుట్టడంలేదండి. ఈ చిక్కులన్నీ వారితో మనవి చేశానండి.

బం:- ఎంత అవసరముంటేనో గాని, బావగారు ఇల్లా కదిలి, బయల్దేరి రారు. తెలుసా...

పం:- అవునండి. ఆ అవుసరం గ్రహించే .. అన్నివిధాలా తాపత్రయ పడుతున్నానండి. ఒకవేళ మనవద్ద సమయానికి సద్దుబాటు కాని పక్షంలో వారికో...వుపాయం కూడా చెప్పానండి.

బం:- ఏమిటదీ ?

పం:- మన యెస్టేటులో దస్తు వసూలు కావడంతోటే తీర్చి పారెయ్యొచ్చు ... అందాకా ... పూర్ణచందు దగ్గిర

బదులు తీసుకోమని మనవి చేశానండి. కాని, నా మాట వారికి నచ్చినట్టు లేదు...

కృ:- బంగారయ్యగారూ! ఈ పంతుల్ని బాగా సంపాయించారే! బలేమాటకార్లెండీ. అతడన్న దేమిటో తెలుసా? వడ్డీలు మామూలేగానీ...కమిషన్లు మట్టుకి అవసరాన్ని బట్టేట...

పంతులు:- ఉన్న వాస్తవం మనవి చేశానండి...రావుబహాదరుగారి పరిస్థితీ, వారికి ఘట్టిగా పట్టుకున్న అవసరమూ యేమాత్రం పొడకట్టినా...అయిదువందలు కాదు సంచీ కరుకులూ లాగి తీరతాడన్న మాట. వారికి మాత్రం తెలియదా యేమిటండి, ఆ కీలకం!

బంగా:- పంతులు చెప్పేమాట సులువుగానే వుంది సుమండి, బావగారూ! వాళ్లు... కేవలం డబ్బు ప్రధానం మనుషులు! అదునూ పదునూ కనిపెట్టి...పచ్చి నెత్తురు పిండుకు తాగుతారు...పంతులూ, నువ్వేం చెప్పినా వినదలుచుకోలేదు. ఎట్లా అయినా సరే, సర్దుబాటు చేసి తీరాలి. వెళ్ళు. ( పంతులు వెడతాడు. )

బంగా:- చూశారా, బా వ గా రూ, ఈ గుమాస్తాగాళ్ళని నమ్మితే వీల్లేదు. నమ్మక వీల్లేదు. వీళ్ళు నడిపించే అంతర్నాటకాలు తెలిసీ కూడా, అధికార్లు దఖలుపుచ్చుకోవటానికి వీలుండదు. అడుగడుక్కీ వాళ్ళని అటకాయిస్తూ వుంటే అసలు ఆఫీసు రథమే ఆగిపోతుంది...మీ విషయంలో...పంతులింక అశ్రద్ధ చేయడులెండి. చెప్పానుగా?

కృ:- చిత్తం, వెళ్ళొస్తా.

[ పంతులు ఇల్లు ]

పంతులు:- వెనకటి కిల్లాగే ... పంగిడీలవలసనించి ... ఒక జమీందా రొకాయన వచ్చాడు; అప్పటికప్పుడు యాభై వేలు కావాలంటూ...అదీ రెండోకంటివాడికి తెలియ కూడదు.. ఊఁ...

కృ:- అవునయ్యా బాబూ! డబ్బు అవసరమంటే యేమిటో ఈ నాటికి తెలిసొస్తూంది.

పంతులు:- అయ్యోసరికి...అర్ధరాత్రిపూట తిరిగి యాభై వేల కరుకులూ గలగల మని కురిపించి... తెల్లవారకుండా ఆ జమీందారుని కలకలమంటూ సాగనంపానన్న మాట... అందులోనూ, పనొచ్చిందంటే మట్టుకి...నా కుందే ..

కృ:- అహఁ! నాకు తెలియదు పంతులూ, నీ చాకచక్యం?

పం:- అయితేం...మహారాజు! ఎంత సరసత, ఎంత యిది! వారి అవసరం కనిపెట్టటానికి మనం ఎంత తాపత్రయ పడ్డామో, అంతకంతా మన సదుపాయం వారూ ఆలో చించారు. ఏదో, ఈ నాడు కొంపమీద రెండు పెంకులు జోర్లించుకున్నామూ అంటే, వారి చేతి చలవే నన్న మాట...

కృ:- అయ్యో కాదూ, పాపం.

పం:- వారి సాహసమూ అటువంటిదే లెండి. పెట్టు పెత్తల్లి అన్నట్టుగా 'ఎవళ్ళకి ముట్టజెప్పవలసింది వాళ్ళకి పారేసి, పని జరిగే యెత్తు చూడాలోయ్ పంతులూ!' అని చెప్పి

మొదటనే చెప్పేశాడు ఆయన. అంచేతనే వారి పని అంచీలమీద చేసుకుపోవటానికి వీలవుతూంది.

కృ:- పంతులూ, నేను మాత్రం నీ మాట కాదన్నానుటోయ్ ? నన్ను కనిపెడతావనే ధీమాతోనే కదూ నిన్నాశ్రయించింది ?

పం:- 'ఆశ్రయింపా ! ' అంత పెద్దమాట వుపయోగించ వద్దండి. మీ బోటి పెద్దలు నలుగురూ ఒక కంటితో చూస్తేనే...

కృ:- అదేమిటోయి, అట్లా అంటావు ? ఇంతకీ, నేను గృహస్థు మార్గంగా వచ్చి కోరాను. మనలో మన వ్యవహారాన్ని చివరికి వ్యాపారమోళీలోకి దింపి వదిలేశావ్.

పం:- రావుబహాదరుగారూ! తమరు నామీద కోపగిస్తే ఇహ నెలా బతకటం చెప్పండి ? అవతల ప్రొప్రయిటరుగారూ చివాట్లేశారాయిరి...మీ యెదటనే. దినముల సామాన్యం కాకపోతే యేమి టిదంతా. విహితం చోట విరోధం కొని తెచ్చుకున్నట్టూ...

కృ:- కాదుగానీ, విహితానికీ వ్యవహారానికీ చాలా దూరం వుందన్న సంగతి మాత్రం, నాకు బాగా బోధపడిం దిప్పుడు...

పం:- అట్లా సెలవివ్వొద్దు. స్నేహితుడు చిక్కులో వున్నాడంటే మటుకి మా ప్రొప్రయిటరుగారు సహించలేరు. అందులోనూ, తమ విషయంలో...

కృ:- దానికేంలే. ఎక్కడయినా బావగానీ...ఊఁ...సరే ఇంతకీ మనల్ని గట్టెక్కించే విధానం యేమి టాలోచించావ్?

పం:- నా చేతులో యేముంది చెప్పండి. అంతా దేముడిదయ.

కృ:- ఇహ ఈ నసుగుళ్ళన్నీ కట్టిపెట్టు పంతులూ...నువ్వు గాకపోతే, మరెవడివల్లవుతుంది? మొదట్నించీ నిన్నే నమ్ముకున్నాను. నన్నో గట్టుకి చేర్చు, మాను. నీదేభారం.

పం:- తమ సెలవుకి యెన్నడూ అడ్డులేదు ... యిప్పుడు ఘట్టిగా అవసరం యెంతో చెబితే...

కృ:- ఎంతేమిటీ, అస్తమానమున్నా- పూర్తిగా ముప్ఫయి వేలూ తెచ్చిపెట్టేతివంటే, అందులో నీ బహుమతీ... అదీ...

పం:- ఆఁ- అవన్నీ తమరు విడమర్చి చెప్పాలా? ముప్ఫయ్యీ సరిపోతాయాండీ?

కృ:- చాల్లే బాబూ...ఈ పులుసుతోటి, ఈ ముద్ద దిగితే... తరవాత చూచుకోవచ్చు...కాని, అయిదు నిమిషాల్లో నన్ను పంపేశెయ్యాలి సుమీ.

పం:- అయిదు నిమిషాలెందుకండీ, నించున్న పాటుని సద్దుబాటు అయిపోదుటండీ? హొ...ఇదుగో. దీనిమీద సంతకం పెట్టించండి.

కృ:- మొత్తానికీ...సామెత సార్థకం చేశావు గద పంతులూ! మొనగాడి వవుదువోయ్...

# పాత్రలు

రామయ్య శెట్టి
వెంకడు
ఇనస్పెక్టరు
నానప్ప
కన్ని

---

* మద్రాస్లు కేంద్రము నుండి ప్రసారితం. 2–10–41
* మళ్ళీ ఢిల్లీ కేంద్రము నుండి ప్రసారితం. 22–12–47

# కన్ని

## మొదటి రంగం

రామయ్యశెట్టి:- వెంకా, పెద్ద పెద్ద బోషాణాలే బద్దలయి పోతావుంటే ఇహ బతికే దెట్టారా? యిన్నాళ్ళాయె సూస్తూన్నవు, మన లోగిట్లో అడుగెట్టడానికి బ్రహ్మాతర మైందీ? యేం, పలక వేం?...ఛేశ్! పాడురోజులొచ్చి పడ్డాయి. ఎంత పండితే యేం లాబం యెంకా...పట్ట పగలు ఖూనీజరిగినా దిక్కూ-దివాణం లేదుగంద. యెఱ్ఱ నేగాని కంటబడితే చాలు...

వెంకడు:- ఏటి బాబూ నీ యెఱ్ఱి ... రామయ్యబాబింట్లో కన్నంపోయిందంటే...ఆడి కెన్ని యేల గుండెలు...

రామయ్యశెట్టి:- కన్నం గాదురా, పిచ్చోడా. ఎక్కడి వస్తు వక్కడేవుంది. కొబ్బరికురిడీలో నీళ్లు మాయమైపోయినట్టు ...లోపలి సొమ్ముమాత్రం యక్షిణీ.. వెంకా, మరె వ్వళ్ళతోటీ అనకేం...పాదుకింద పాతిపెట్టిన బింది బింది లాగే వుందిరా, అందులో పోసిన ఇరవై వేలూ...

వెంకడు:- అయ్యో బాబయ్య! బాబయ్యో! బాబో...

రామయ్యశెట్టి:- గోలచెయ్యకురా నీ యిల్లుకూలా. పోయిన సొమ్ము పోయిందిగానీ లేనిపోని గోస...

వెంకడు:- ఇది మరోడి పనీ మరోడి పనీ కాదు బాబయ్యా. అగ్గిదొరదెబ్బే! ఆడికి గాకపోతే ఇంతశిత్రం మరెవడికి శేత

నవుద్దండీ. వవ్వారే, వవ్వారే. యెంతపని...యెంతపని ...గవిని మెంటోరికి యిప్పటికిప్పుడే వోలచ్చు అర్జీ లెల్లి నాయంట బాబూ, ఆడిమీాద...

రామయ్యశెట్టి:- నేనూ వడేశాను వకటి. యేంలాబం...అస లాక్కాళ్ళకీ అంతు చిక్కందే.

వెంకడు:- హే, యెట్టా శిక్కుతది రాఁవయఁబాబూ, నీ యెర్రి గానీ...అగ్గిదొరని గురించి యెంతసేపూ కలిగినోళ్ళే యేడి శేది. ఆడి పేరు శెబితే అడివిలో కెల్లినా అన్నం పుడత దంటారు పాటకజనమంతా. అంత బత్తీ, అంత యిశ్వాస మున్ను ఆడంటే. దొంగ వుర్తి చేస్తే యేంగాక.. బలే నీతిమంతు దంటదండి లోకం...

రామయ్యశెట్టి:— పడిశావులే ... నీతి ... దొంగాడికి నీతీ జాతిన్నీ...

వెంకడు:- అలాగ్గనెయ్యకండోయ్...పోనీ బాబయా, డబ్బి నోళ్ళని కొట్టినాడన్న మాటే కానీ, ఇంత కాలమయింది ...పడుసుపిల్లల్ని పలకరించినట్టు ఎప్పుడైనా యిన్నావూ, శిత్రం శెబితే...నమ్మవుగాని రాఁవయఁ బాబో...పయిలా పచ్చీసుగా తిరగాల్సిన వొయసా, అగ్గిదొరదీ...అయినా, అగ్గిలాటి పెవర్తన...ఆడికేం కులం తక్కువా, డబ్బు తక్కువా, రూపం తక్కువా...'కో' అంటే సరి కోటి మంది రంబలొచ్చి పడతరు ... కాని సెప్పొద్దూ .. ఆ సూపే లేదు అతగాడికి...

రామయ్యశెట్టి:— య్రెరి మొగ<వా...ఏవూరి కత లివన్నీ...

వెంకడు:— కతలు కావు బాబయ్యా ! మరో తమాషా యిన్నారరా ?—మన యేటొడ్డుని గొబ్బిరి తోట నేదండీ? అక్కడ పాకలో కన్ని అనీ ముత్తెంలాటి కుఱ్ఱ దున్నదండి. అదీ, దాని మారుడు తల్లీ—యిద్దరే ఆ పాకలో వుండేది. కన్నీ అంటే...జాతికి మణిపూ సంటారండి, కిట్టనోళ్ళ యినా సరే...అగ్గిదొరకి అదంటే మనసుటండీ. ఆ కన్ని కూడా ఆడంటే అట్టానే పడి సత్తాదంటండి...ఆ డొక చెనం పైకి పోతే...ఎప్పుడొత్తాడా, యెప్పుడు కంట బడ తాడా అని పలవరిత్తదటండి...కాని, బాబయ్యా! యిన్ని కబుర్లు పుట్టినాయే గానీ...దానింటికాడ ఆడుండగా సూసినోడు...

రామయ్యశెట్టి:— ఒరే వెంకా! నీ కెవడోగాని మత్తుమందు బాగా యెక్కించేసినట్టుంది. సరే నేను పోలీసుస్టేషనుకెళ్ళి ...అర్జీసంగతి యేఁవయిందో కనుక్కోవాలి. నువు మళ్లీ సాయంతరం అవుపడు, యేం.

వెంకడు:— అట్టాగే బాబో.

## రెండవ రంగం

ఇనస్పెక్టరు:— నానప్పా! ఇదుగో చూశావా, రామయ్యశెట్టి దగ్గిర్నుంచి మరో కంప్లెయింటూ...అబ్బ...ఈ అగ్గిదొర ఆగడాలకి అంతూపొంతూ లేకుండావుందే. చూడు,

అవన్నీ అర్జీలకట్టలే...నేను సర్వీస్‌లో ప్రవేశించి, గజ దొంగల్ని బందిపోటు దొంగల్ని లక్షాయాభై కేసులు పట్టాను, స్వయంగా. అట్టాటిది...ఆరునెల్లయింది. అహో రాత్రాలు తంటాలుపడినా, నలుపూ తెలుపూ కనబడదే ...కాలూ చెయ్యీ అందటంలేదూ...వాణ్ణి పట్టియిచ్చిన వాడికి అయిదువంద లిస్తామన్నాం...సంచి రూపాయిలు కూడాయిస్తామని ప్రకటించాం...యెవ్వడూ మొగ్గందే... అస లింతకీ ముందుకొచ్చి ఆచూకీచెప్పేధైర్యం లేకుం డావుంది నానప్పా, ఒక్కడికిన్నీ...ఎంచేతనో కానీ...

నానప్ప:- చిత్తం. వాడెప్పటికైనా వుపాయంమీద దొర కాలెగానీ...

ఇనస్పెక్టరు:-మరి నిన్నెందుకనుకున్నావ్, యిప్పుడు పిలిచిందీ. నేనో వుపాయం ఆలోచించాను. అది నెరవేరాలీ అంటే ...మాంఛి విలుకాడు, బలేగా సాముతిప్పేవాడు, గుండె నిబ్బరంకలవాడు, సర్వసమర్థుడూ కావాలి.

నానప్ప:- నిజంవేనండి. అగ్గిదొరని పట్టేవాడు ఎంతటి మొన గాడై వుండాలె...

ఇనస్పెక్టరు:- అట్టాటి మొనగాడున్నాడు, మన పటాలంలో ఉన్నాడులే, నానప్ప అనిచెప్పి...

నానప్ప:- (నవ్వు) ఎంత మాట సెలవిచ్చారు...తమ కుండే అభిమానం అట్టాటిదీ...

ఇనస్పెక్టరు:- చూడు నానప్పా...నువ్వో నేనో అని చెప్పి ఎదట బడి వాణ్ణి జయించడమనేది కల్లోమాట. కానీ నే చెప్పినట్టు చేస్తివంటే వాడూ, వాడి తాతాకూడా మనకి దాసు లయ్యారన్నమాటే. నువ్వు మెల్లిగా వెళ్ళి అగ్గిదొర వుంచాడు, ఎరగవ్ ... కన్ని ... అది వుండే కొబ్బరితోటకి చేరువగానే మకాం చెయ్యి. దానికి మారుడు తల్లి వొకర్తుంది...ముసిల్ది. దాన్నెంతసేపులే లోపు చేసుకోవటానికి. కావలసినంత ధనం నే నిస్తాను. అలా నెమ్మదిగా...ఆ గుడిసెకు వెళుతూ, వస్తూ ... ఆ రాకపోకల్లో మెల్లిగా క న్ని ని వశపర్చుకోవాలి. తెలిసిందా ?

నానప్ప:- అల్లాగేనండి. తమ సెలవుకి అడ్డుంటుందా.

ఇనస్పెక్టరు:- అయితే, మనం అనుకున్న దంతా వొక్క-మాటుగా అయ్యే పని కాదులే. కాని,...చూసి చూసి నీమీాద మోజు కలిగిందిరా అంటేమటుకి, మరి నిన్ను వొదల్దు కన్ని. అదెప్పుడయితే నీ వలలో పడిందో, గుట్టు యీావత్తూ లాగేశావన్నమాటే.. లాగడఁవేమిటీ...వాణ్ణి పట్టిచ్చెయ్యటానికి తనంతట తనే వప్పుకుంటుంది. అదు నులో-వాడి ఆరా లాగటం, చాటున దాగడం, కన్నిదగ్గిరికి వాడు రావటంతోటే చుట్టుముట్టి పట్టెయ్యడం.

నానప్ప:- అబ్, ఇదెంతపనండీ.

ఇనస్పెక్టరు:– అరే, నానప్పా ... యికచూచుకో. నీకు బ్రహ్మారథం ... పూలశయ్య ... కుబేరుడివైపోతావ్ ... ఇంతకీ నీకు రేఖబయల్పడేయోగం వచ్చింది... ఓ మూల నించి లక్ష్మి తోసుకొస్తూంటే, నానప్పా! యెవడితరంరా అడ్డుకోడానికి? అన్నట్టు...మజా...గృహలక్ష్మి...కన్నిని కూడా వెంటబెట్టుకొద్దువుగాని,...హాహ్హాహ్హా...

## మూడవ రంగం

[ కొబ్బరితోట ముందు ]

నానప్ప:– కన్ని యింటిపక్కన చేరినందుకు– ఏదో, చుక్క భాయీల్నందరినీ చేరదీసి, తలతిప్పుకుంటున్నాను. అగ్గి దార రాకపోకలూ సమాచారాలూ ఎప్పటికప్పుడు తెలుస్తూనే వున్నాయి. కాని...కన్నితో యెవ్వారం అనుకున్నట్టుగా లేదు. నాలుకాసులు చేతులో పడంగానే, ముసిల్దాని సద్దు అణిగిపోయిందిగాని...పిల్లమాత్రం లొంగి రావటం కనపడదు...ఇప్పటికి వందసార్లయినా వాళ్ళింటికి వెళ్ళాను. ముసిలిదాన్ని అడ్డంపెట్టుకుని మనసులో వుద్దేశం ముచ్చటించాను. రెండేసి అర్థాలుకూడా గుప్పించి మాటాడాను. మూగిదానిలా ఓ మూల కూర్చోటమే గాని, ఆ కన్ని కన్నెత్తయినా చూడందే. అవతల చూడబోతే అధికారి...ఎప్పుడెప్పుడంటూ రొకాయిస్తున్నాడు. ఇంతవరకూ ఏదో జరుపులు పెట్టుకుంటూ వచ్చాను. ఇంక

లాభంలేదు. పంజో కాయో తేల్చుకోవాలి—అదుగద్గో ...యిట్టాగే వస్తాంది వనలచ్మి...కన్ని...ఇప్పుడీ పోకు దువ్వెన్న సూపిచ్చి మజాచెయ్యాల. అక్కడికీ లొంగక పోయిందీ...ఆఖరుకి బ్రహ్మాస్త్రం వేసి బంధించేస్తా. అగ్గి దొరకి నేను ప్రాణస్నేహితుణ్నంటాను...ఆతడికి విపత్తు రాబోతున్నదని నమ్మించుతాను, దానికి విరుగుడు నా దగ్గిరున్నదని డబాయిస్తాను.

[ కన్ని వస్తుంది ]

నానప్ప :- చూడు కన్నీ, ఈ దువ్వెన్నతో నీ వుంగరాల జుత్తు దువ్వుకుంటివంటే...

కన్ని :- ఉహూఁ.

నానప్ప :- అలాకాదు. తీసుకోవాలి...దువ్వుకోవాలి...

కన్ని :- దూరంగా వుండండి. అక్కర్లేదంటే తెల్దూ ?

నానప్ప :- ఎందుకింతకోపం...అన్నట్టు...కన్నీ...ఈ సంగతి విన్నావా ? మన దొరని పట్టడానికి కొత్తగా యెవరో యినస్పెట్రు దిగాట్ట. అయితే, నీ భర్తఅంటే నాకు ప్రాణం...నీకంటే అతడెక్కువన్నమాట. నేనుండగా... అలా అగ్గిదొరమీద యీగని వాలనివ్వటమే ?

కన్ని :- మరిగంటే,...మా బావయ్యెక్కడికొచ్చినప్పుడు ఏద యినా పెమాదమొస్తే, నువ్వేం చెయ్యగల్తువ్ ?

నానప్ప:- పెమాదమా? హేఁ. ఒక్కపిడిగుద్దుతో పాతికమంది ...యెరుగుదువా? ఈడు బీముడనుకో...వొకటే లెక్క...

కన్ని :- ( పకపక నవ్వి ) మరి, గవనమెంటోడి దగ్గిర ...

టుపాకలున్నయంట. ఆడిముంగట...నీజబ్బ సత్తవెందుకు పనికొస్తదీ?...

నానప్ప :- అర్దీ. అచ్చోణీలాంటి ప్రశ్న వేశావు ... కన్నీ! నానప్ప మజా...కుర్రగుంటవి...నీకేం తెలుసూ? ... గుండేసి కొట్టమను, ఊస వొదలమను, సాము తిప్పమను, బాకుచ్చుకు పొడవమను...నా పవరు చూద్దుగాని... సమత్తవిద్దెలూ నేరిచిన మొనగాడు నానప్పంటే...

కన్ని :- మరవితే, నానప్పగారూ, ఇంతటోరని యెప్పుడూ శెప్పినారు గారేం?

నానప్ప :- అల్లా అడుగూ...చుశావా, వాళ్ళలాగా వీళ్ళలాగా డాబులుకొట్టడం మన పద్ధతికాదు. యింతకీ ఎప్పుడైనా మన మాట నువు చెవిని పెడితేగా? ఏనాడయితే ఇక్కడ కాలుపెట్టి నీ ముఖం చూశానో, అప్పటినించీ... మరి యెంచేతనో గాని, నిన్ను విడిచి వెళదామంటే కాలాడకుండా వుంది. మనిద్దరికీ ప్రాణమైన అగ్గిదొర సంగతి సందర్భాలు విన్నటికయినా నీ కోకిల గొంతుతో వినిపిస్తావేమో, ఆనందించుదామని చూతునుగదా ... నీ పలుకే బంగారమైపాయె.

కన్ని :- నానప్పగారూ, మీరు మా క్కావల్సినోరన్నమాట కానలేక పొయ్యామండీ.

[ కన్ని వెళుతుంది ]

నానప్ప :- వేశాను, కోటలో పాగా...కన్ని నన్ను పూర్తిగా నమ్మేసింది...హితకోటిలో ముఖ్యుణ్ణిగా ఎంచుకుంది...

నావల్ల తనకి జరగబోయే ఉపకారాన్ని గ్రహించింది ...కాస్తంత బులావ్ చేస్తే సరి, గుట్టు చెప్పేస్తుంది... చెప్పెయ్యడ మేఁవిటీ? అగ్గిదొరని బుగ్గి చేసేసి, కన్ని హృదయంలో నానప్ప దూరేస్తాడూ...

## నాల్గవ రంగం

నానప్ప :- మొత్తంమీద, కథ బాగానే నడుస్తోంది...మనం తెచ్చియిచ్చే బహుమతులన్నీ ఆప్యాయంగా అందుకుంటూనేవుంది కాని, మునపట్లాగ విసిరికొట్టడంలేదు. ఏవయినా ఛలోక్తులు విసిరితే వాటి నామోదిస్తూనే వుంది గాని, మూతి ముడుచుకుపోవటంలేదు. కానీ ... 'పటాలాలు యిక్కడికి మూడు మైళ్ళ దూరంలోనే వున్నయ్ సుమా——మన అగ్గిదొరని మెలుకువగా వుండమనూ...ఖబడ్దార్'...అని జాగర్త చెప్పేసరికి...విరగబడి వెర్రినవ్వు నవ్వుతుందేం చెప్మా ... ఫరవాలేదులే ... గ్రాసు మనవేపే మొగ్గుతుంది గానీ... అయినా, ఈ మను వెంతవరకూ ఖాయమో తేల్చుకోవాలి ... రైట్ ... అదుగో...మాటలోనే వొస్తూంది...

[ కన్ని వస్తుంది ]

నానప్ప :- కన్నీ...ఇవేళ మనం వెన్నిట్లో షికారెల్లి రావాల. నువ్వూ, నేనే...యేం?

కన్ని :- అలాగ్గే...

నానప్ప :- పద, మరి...ఈ కొబ్బరిచెట్టు క్రింద నీడని కూచుందాం, రా...కన్నీ...యెన్నాళ్ళనించో చెప్పాలని కడుపులో వుద్దేశం. ఇప్పటికొ—దా అదునుదొరికింది...చూడు, కన్నీ నన్ను పెల్లాడినావంటే...వల్లమాలిన డబ్బు...

కన్ని :- ( నవ్వి ) ఆ పైకెల్దాం రండి...బాగా నీడగా వుంటది.

నానప్ప:- (తనలో— తస్సాదియ్యా, దీని పెంకిబిగిలు ఇప్పటికి అణిగినయి. ఎన్నాళ్ళకొచ్చింది, దారికి)...పదా నీయిష్టం ...నీ సరదా...

కన్ని :- రాండి...ఇక్కడ కూకుందాం...

నానప్ప :- కన్నీ ! —— అగ్గిదొరంటే అట్టా పడిసచ్చేదానివే. ఆడిపాటీ చేశానుగానా నేనూ ?

కన్ని :- ( పకపక నవ్వుతుంది )

నానప్ప :-మరి...కన్నీ...మనుసులు కలిసిపోయాక, ఇంకా ఎడంగా కూచుంటావేం ? దగ్గిరసా రా...

కన్ని :- ఇదికాదు సమయం...

నానప్ప :- సమయ మేంటీ...రమ్మంటే...

కన్ని :- ఛీ...చెయ్యోదులూ...

నానప్ప :- ఇన్నాళ్ళూ తిప్పావు, ఇప్పుడెక్కడి కెళ్తావ్ ?

[ ' జామ్మని ' ఊచవచ్చి నానప్ప గుండెల్లోకి దూసుకుపోతుంది ]

నానప్ప :- అమ్మో,...కన్నీ...

కన్ని :- ( కిలకిల పెద్దగా నవ్వి )



# పాకాల చెరువు



## పాత్రలు

| | |
|---|---|
| ప్రతాపరుద్ర మహారాజు | ప్రభువు |
| శివదేవయ్య | మంత్రి |
| పురోహితుడు | |
| అతని భార్య | |
| దండోరా కొట్టేవాడు | |

---

* మద్రాసు కేంద్రమునుండి ప్రసారితం : 22-12-47

[ *పాకాలచెరువు తెలంగాణాలో ఒక విశాలమైన సరస్సు. దీన్నిగురించి పరంపరాగతంగా చెప్పుకొనే ఒక చిన్నకథ ఈ నాటికకు ఆధారం.* ]

# పాకాల చెరువు

## మొదటి రంగం

[ దర్బారు ]

రాజు :- శివదేవయ్య మంత్రిత్వం, హా ! నా రాచరికమున్నూ, బాగా కుదిరింది. ఇహ, రాజ్యంలో ప్రజకి లోటేమిటి ?

మంత్రి :- చాలా...చిత్రమయిన....

రాజు :- చిత్రంకాదు, శివదేవయ్యా, సిగ్గుపడవలసిన విషయం.

మంత్రి:- సత్యమే. సిగ్గుపడవలసిందే, ప్రభువులు సెలవిచ్చిన హాంశం...

రాజు :- ప్రభువులు సెలవిచ్చింది కాదోయి, శివదేవయ్యా. అమాయక పేదసంసారుల నోట అప్రయత్నంగా వెలువడ్డ వాక్కులోయ్, ఇవి.

మంత్రి :- ఏలిక హృదయం గ్రహించగలిగాను, ప్రభూ !

రాజు :-ఇప్పటి నా ఆవేదన గ్రహించడం సృష్టికర్తకే సాధ్యం కాదు.

మంత్రి :- రామరాజ్యమని పేరుపొందిన మన కాకతీయ సామ్రాజ్యంలో ఇటువంటి పలుకులు ఎందుకు వెలువడవలసి వచ్చిందో.

రాజు :- అవసరమున్న కనకనే. ఆ పలుకుల్లో పరమసత్యమున్నది కనకనే.

మంత్రి :- ప్రభూ, కాకతీయ సామ్రాట్టులపేరిట వెలిసినన్ని పురాలూ, గోపురాలూ మరెన్నడయిన వెలిసినవా ?

మనము నిర్మించిన కోటలూ, ప్రతిష్ఠించిన తటాకాదులూ మరే రాజ్యములోనైన ఉన్నవా? పౌరుషానికీ ఔదార్యానికీ మనవంశపు కీర్తిచంద్రికలు ఖండాంతరాలు దాటిపోయినవికావా? ఇటువంటి రాజ్యంలో...

రాజు :- శివదేవయ్యా, కూటికి గుడ్డకి గతులు కల్పించలేని సామ్రాజ్యాలు ఉండేం, లేకేం? కరువుకాటకాలతో ప్రజ పిడికెడు గింజలు దొరక్క ఎట్లా కటకటలాడిపోతున్నారో గమనించావా? ఈ ఆహారసమస్యలో ఇట్లా దేశం మ్రగ్గిపోవలసిందేనా? దీనికి మార్గాంతరమేదైనా వున్నదా, లేదా? ఈ ప్రశ్నకి నాకు సూటిగా సమాధానం కావాలి.

మంత్రి :- అసువులనైనా అర్పించటానికి సంసిద్ధుణ్ణి, ప్రభూ.

రాజు:- అసువులెవరిక్కావాలి, శివదేవయ్యా! కసవు కావాలిప్పుడు ప్రజకి. అది పుష్కలంగా అమరేవరకూ, మన రాజ్యాన్ని పట్టి పీడిస్తున్న క్షామదేవత తొలగిపోదు. ప్రజల క్షోభ తగ్గదు.

మంత్రి :- ప్రభువులకు తెలియందేమున్నది? మనది కృషిప్రధానమైన దేశం. వ్యవసాయం దైవసాయం పయిన ఆధారపడివున్నది. ఈ విషయంలో మనం చేయగల సాధనాలన్నీ అమలు చేస్తూనేవుంటిమి.

రాజు :- వాస్తవమే, శివదేవయ్యా. దైవబలమనేది తోడు చేసుకోవాలే గాని, భారం యావత్తూ దేముడిపైనే వేసి కూర్చుంటే ఇట్లాగే వుంటుంది పరిపాలన! పంటలకోసం

కేవలమూ వర్షంమీదనే ఆధారపడ్డం పనికిరాదు. బుద్ధి బలం వినియోగించి కొత్తకొత్త నీటివసతులు కల్పించాలి.

మంత్రి :- చక్కటిమాట సెలవిచ్చారు ప్రభూ.

రాజు :- మన రాజ్యంలో జలాధారాలు చూపించినవారికి కోరిన బహుమాన మిస్తామని ఇప్పుడే చాటింపు వేయించు శివదేవయ్యా.

మంత్రి :- చిత్తం. ప్రభూ.

## రెండవ రంగం

పురోహితుడు :- బొత్తిగా...నోయ్, కాలం యెటూముటీ అయిపోయింది చూస్తూండగానే. టాణేదారుగారింటికి వ్రతానికి వెళితే...కలశమీద మూడు కుంచాలుపోయించే మహారాజు...మూడు మానికలు పోయించి...'ఇంతటిలో సరిపెట్టించండి శాస్త్రుల్లుగారూ!' అనేశారు. ముక్కుమీద వేలేసుకోవాల్సి వచ్చింది. కన్ను పొడుచుకున్నా గింజ కనబడటంలేదు.

భార్య :- ఏమిటో, అస్తమానం, కుడికన్ను అదురుతూందం టారు. ఇంతాజేసి, రోజూ దొరికే నూకలయినా లేవాయె. ఏం లాభమో, మన్నో.

పురో :- అసలింతకీ...చెప్పాల్సిన విషయం మరిచేపొయ్యా. ఇవాళ పాకాలమీదుగాపోయి వస్తున్నానంటినా, అక్కడ

—గ్రామదేవత గుడికి అవతలగా ఓ దేవాలయం కట్టించాలని చెప్పి, పెద్దలంతాకలిసి పునాదులుప్రారంభించారు.

భార్య :- అవితే, సంతర్పణ భోజనం తగిలింది కాబోలు ?

పురో :- వోయ్, ఉండవే, నీ భోజనం బంగారంకానూ! దైవబలం కలిసొచ్చింది. వాళ్ళ పూర్వపుణ్య విశేషంవల్ల టపీమని పునాదుల్లోంచి జల వూరింది.

భార్య :- ఎంత పుణ్యవఁమ్మో, మనం ఆ వూరు పోయినా బాగుండిపోనూ.

పురో :- బాగుండిపోతుంది. ముందు చెప్పేదంతా విను. ఇప్పుడూ...ఆ గ్రామదేవత బలికోరుతున్నదని భయపడి, ఎక్కడపని అక్కడనే వదిలేసి పరుగులెత్తారు పనివాళ్ళు.

భార్య :- భయంకాదేం, చెప్తారుకాని, అమ్మవారంట్టే ఎవళ్ళకయినా భయఁవే...

పురో :- ఆఁ, భయం ? ఎందుకో...ఆ పట్టుపట్టు తటాకప్రతిష్ఠ చేయించేస్తే ఎంత బావుండును. ఈ రాజ్యంలో ఇట్లా కరువూ కాటకమూ కాలుపెట్టగలదా ? ఇంతకీ, పనివాళ్లు పిరికిపందలు కావటం వచ్చింది ముప్పు...

భార్య :- అవును. ప్రతిష్ఠ ప్రారంభిస్తే...ఎంత లేదన్నా... ఈ వుదుట్లో, మన దరిద్రమూ వదిలిపోను.

[ చాటింపు ఎక్కడో దూరంగా ]

పురో :- ఇదే... యింక సామాన్యులు తలపెట్టతగిన పని కాదు. మారాజులు పూనుకోవాలిసిన కార్యం. ప్రతిష్ఠ

జరిగిందా అంటే...మన దరిద్రం, ప్రజల దరిద్రంకూడా పటాపంచలైపోతుంది. ఎట్లాఅయినా తుదనెగ్గించాలి.

[ చాటింపు దగ్గిరవుతుంది. ]

ఉండు, అదేదో చాటింపవుతూంది.

చాటింపు :- ఈ గ్రామంలో యావన్మందికిన్నీ తెలియ:శాయ డం ఏమిటనగా—మన రాజ్యంలో కరువ్వూ కాటకమూ లేకుండా శేయడానికిగాను ఎక్కడయినా సరే...జలదార పడేతావులు సూపిచ్చినోరికి కోరుకున్న బగుమాన మిత్తారు గనక, తెలిసినోరు కోటకి రావాలసిందండో హాోయ్.

పురో :- భేష్ భేష్. పండూ పండింది, కాకీ వాలిం దన్నట్టు ...ఆс...అల్లా కలిసిరావాలె దానంతటది.

భార్య :- ఏమిటండీ హడావుడి ?

పురో:- ముందు నా కుండనాలూ శాలువా తియ్యి. తియ్యవే. వేగం. రాజుగారి దర్శనం చేసిరావాలీ. ఇప్పుడు మనం అనుకుంటున్న సంగతే, సరిగ్గా చాటింపయింది. అమృత ఘడియచూసి ఈ వార్త కొస్తంతా, ప్రభువువారి చెవిని వేస్తినా, మన కలలు ఫలించాయన్న మాటే.

భార్య :- ఇందుకే కాబోలు, కుడికన్ను అదిరిందన్నారు.

పురో :- తియ్యి, దుస్తులు తియ్యి. ఇప్పుడు సమయం చాలా దివ్యంగా వున్నది.

## మూడవ రంగం

రాజు :- గొప్ప విషయం వినికిడిచేసారు, గురూజీ! మీ రాక వల్ల అపరిమితానందమైంది. నా చిరసంకల్పానికి రూప మీయడానికి వచ్చిన దైవస్వరూపులే తాము...

పురో :- ప్రభువువారి అవ్యాజానురాగం అటువంటిది. ఇం తకూ నేను నిమిత్తమాత్రుడిని. పవిత్రహృదయంతో సంక ల్పించిన దానికి దైవబలం ఎందుకు తోడ్పడదు, ప్రభూ!

[ విరామం ]

ఈ ప్రయత్నం నెరవేరినట్లాయెనా,...ఎన్నెన్నో ఖం డాలు సుక్షేత్రాలైపోతయి; లక్షలాది ప్రజకు మన రాజ్యం అన్నప్రదాత అవుతుంది. ఈ పుణ్యం కట్టుకునే బాధ్యత యేలికదే.

రాజు :- కార్యం నిర్వహించే బాధ్యత గురువులది. ఇందుకు మన మేంచేయాలో చెప్పండి. మీకు అవసరమయినంత జనమూ ధనమూ సిద్ధంగావుంది.

పురో :- కార్యభారం యావత్తూ నేను నిర్వహిస్తా. ఈ చెరువు తవ్వించే పూచీ నా తలపైన ఉన్నదని మాటయిస్తున్నా. అయితే...నాకొక్క హామీ అనుగ్రహించాలి, ప్రభువు వారు. ఏమిటీ అంటారేమో. ఎన్ని జరిగినాగానీ భయ పడి వెనుదిరగకుండా ప్రత్యూకునిపోయే గుండె నిబ్బరంగల పనివాడు కావాలి.

రాజు :- ఇప్పుడే వేయిద్దాం చాటింపు. రాజ్యం యావత్తు

లోనూ ఆమాత్రం ధైర్యవంతుడయిన పనివాడే దొరక్క-
పోతాడా ?

పురో:- ఈవిషయంలో...నేను సంశయపడుతున్నందుకు ప్రభు
వులు మరోకలాగున భావింపకూడదు. లోగడ పాకాలలో
... దేవాలయం నిర్మించటానికి పునాదులు తవ్విన
వాళ్లున్నారే...బలే పనివాళ్లు. పులులు ఎదటికివచ్చినా
చలించని గుండెధైర్యం కలవాళ్లు. అటువంటిది తీరా జల
పూరే సమయానికి, వాళ్లు హోరుకి నిలబడలేక చెల్లా
చెదరై పోయ్యారు.

రాజు:- ఇప్పుడూ అంతే అంటారా, గురూజీ!

పురో:- నాకున్న జంకుకొద్దీ, మనసులోమాట మనవిచేసాను.
అయినా, ప్రభువులు తల్చుకుంటే...

రాజు:- గురువులు సంకల్పసిద్ధులు. అంచేత మనం తలపెట్టిన
ఈ కార్యం నెరవేరి తీరుతుందని నా విశ్వాసం.

తమరు అమోఘమైన సుముహూర్తం నిశ్చయించండి.
తరవాత సంగతి చెప్తా.

పురో:- చిత్తం. మళ్ళీ దర్శనంచేసుకుంటా.

# నాలుగవ రంగం

[ చాటింపు ]

యావన్మంది ప్రజలకీ తెలియచేయడమేమంటే—పాకాల గ్రామంలో శెరువు తవ్వటానికి ధైర్యమైన పనివాళ్ళకు, కోరిన డబ్బిస్తారు గనక, కోటకి వచ్చి మంత్రిగారితో మాటాడుకోవలిసిం దోహోయ్.

ఒకరు:— బాగానేవుంది రాజుకి పిచ్చి. ఆ పాషాణపురాళ్ళల్లో జలవూరడం యేఁవిటి? నా మొహం.

ఇంకొకరు:— జల కాదురా, పురోయితుడికి డబ్బు వూరుతుంది, ఈ వుదుటిలో.

ఒకరు:— ఏడిశావ్, అట్టాఅనక, దేవి కోపగిస్తాది.

[ తిరిగి చాటింపు ]

ఒకరు:— ఓలమ్మో, యెంత సాగసవఁమ్మ, నిరుడీరోజుల్లో పునాదులు తవ్వినోళ్ళూ...అమ్మోరు నేత్రం తెరిశేసరికి టొపుకున్నరు గందా. మళ్ళీ యేటి, యీ వోలకం?

ఇంకొకరు:— డబ్బే డబ్బు, డబ్బు, డబ్బూ అంటే కొండమీది కోతి దిగొస్తాది. ఈ సాటింపు వింటే కోటిమంది ఎగేసుకొత్తరు.

మూడవవారు:— ఆఁ. వొత్తారు, సూద్దువుగాని. అమ్మోరంటే మజాకాదు.

[ చాటింపు క్రమంగా తగ్గుస్తాయి. ]

# ఐ ద వ ర ం గ ం

పురో:- ప్రభూ, ఇవాళరాత్రి సరిగ్గా పన్నెండు ఘంటలకి సుముహూర్తం. ఇటువంటి బలీయమైన ముహూర్తం నా జీవితంలో ఇంతవరకూ చూడలేదు ప్రభూ, ఇప్పటి వరకూ పనివాడొక్కడూ అగపడలేదు.

రాజు:- మీరేమీ దిగులుపడకండి గురూజీ! పదిమంది ఎందుకు, ధైర్యంకల పనివాడు ఒక్కడుంటే చాలదూ?

పురో:- చాలు మహారాజా జలపడిందీ అంటే తక్కిన పని అంతా నెమ్మదిమీద చేసుకోవచ్చు. జల పడేవరకు నా మనస్సు ఆరాటపడిపోతూంది. ఆ పని పూర్తి అయ్యే వరకూ నిలబడే పనివాడు కావాలి.

రాజు:- గురూజీ! మీరెంతమాత్రం ఆరాటపడవద్దు. ఉత్సాహంతో యేర్పాట్లు సాగించండి. సుముహూర్త సమయానికి అందేటట్టు, పనివాడిని పంపించే పూచీ నాది...

పురో:- ప్రభూ, అన్యథా తలచకండి. ఈ ముహూర్తానికి పని జరక్కపోయిందో ఇహానంతే. మరెప్పటికీ జరగదన్న మాటే. అంతటి మహత్తరమైన సుముహూర్తం. పనివాడి విషయం...

రాజు:- పనివాడు వచ్చితీరతాడు గురూజీ! నామాట నమ్మండి.

పురో:- చిత్తం. నిరీక్షిస్తూ వుంటా.

[ పురోహితుడు : పనివాడు ]

పురో:- భేష్, రుద్రయ్య పేరు చాలా చక్కగావుంది. మా కార్యం నిర్విఘ్నంగా నెరవేర్చేలాగే అగుపడుతున్నావు.

పని:- ఏమిటో, బాబు అలా సెలవిస్తారు.

పురో:- అల్లాకాదు రుద్రయ్యా, నీవంటి మొనగాడికోసం నేనూ రాజుగారూకూడా తపించి పోతున్నామోయ్. మాటా మాణిక్యం తక్కించేవాడు ఒక్కడేచాలు. దొరికి నందుకు పరమ సంతోషంగావుంది.

పని:- తమ అభిమానం అట్టాటిది.

పురో:-చూడు రుద్రయ్యా, పుచ్చపువ్వులా వెన్నెలకాస్తూంది. నేను నీ వెనకాతలే వుంటాను. నీకొచ్చిన భయమేమీ లేదు. సరిగ్గా సుముహూర్త సమయానికి ఒక ఘంట మోగుతుంది. అదే ఆనవాలు. ఠకీమని పని ప్రారంభించ డమే. తెలిందా?

పని:- చిత్తం.

పురో:- సిద్ధంగా వుండు.

*శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం*
*ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే.*
*విభూషితానఙ్గరిపూత్తమాంగా సద్యఃకృతానేకజనార్తిభంగా*
*మనోహరోత్తుఙ్గ చలత్తరంగా గంగా మమాంగా న్యమలీ కరోతు*

[ జేఘంట మోగుతుంది. ]

[ పార, పలుగు పనిచేస్తున్న ధ్వని. ]

తల్లీ, గంగాభవానీ, కరుణించు జననీ!

పురో:- రుద్రయ్యా, అదేవరస, కానీ.

వెల్లన్ మదిన్ నిన్ను భజింతు గంగన్
ఫుల్లాంతరంగన్ బహుపుణ్యసంగన్
కల్లోలలక్ష్మిన్ జితాకాశ మల్లిన్
దల్లిన్ సుధీకల్పలతామతల్లిన్.

[ భయంకరమైన ధ్వని. ]

పురో:- నాయనా, రుద్రయ్యా, అప్పుడే అలిసిపోయావే. ఇంకొక్క పది పారలెయ్యి. ఇహ జలపడిపోతుంది. సమయ మయింది. అక్కడే, అక్కడే.

శ్లో. స్ఫురత్కామక్రోధ ప్రబలతర సంజాత జటిల
జ్వలజ్జ్వాలాజాలజ్వలితవపుషాం నః ప్రతిదినమ్,
హరన్తాం సంతాపం క మపి మరుదుల్లాసలహరీ
ఛటాచఞ్చత్పాథఃకణసరణయో దివ్య సరితః॥

పురో:- రుద్రయ్యా, రుద్రయ్యా, రుద్రయ్యా, కనబడడేం! ఎక్కడయినా సోలిపోయాడేమిటి చెప్మా. ఇప్పటిదాకా పార చప్పుడు వినబడుతూనే వుందే. సరి, ఇప్పుడతనికోసం వెకితేకాదు. కాస్తంతలో వుంది. నేనే పని పూర్తి చేసెయ్యాలి.

[ పార చప్పుడు ]
[ పెద్ద శబ్దం. ]

పురో:- జై. గంగాభవానీ జై.

అందరు:- పడింది, జలపడిందీ, జలపడిందీ——(కోలాహలం.)

# ఆ ర వ రం గం

[ ద ర్బా రు ]

పురో:- ఎట్లా అయితేనేం, పని దిగ్విజయంగా సాగిపోయింది ప్రభూ! జలపడింది.

రాజు:- చెప్పానుకదా, గురువులు సంకల్పసిద్ధులు.

పురో:- ఇందులో నా ప్రజ్ఞ కొంచమూ లేదు ప్రభూ! రాత్రి వచ్చిన పనివాడు నిజంగా దైవస్వరూపుడు. అతని చాక చక్యమువల్లనే మన పాకాల చెరువుకి రూపు రేఖలు యేర్పడ్డాయి. కాని, నా కొక్కటే మనస్తాపం పట్టుకున్నది.

మం:- ఇటువంటి ఉత్సాహసమయంలో విచార మెందుకు, ఆచార్యా!

పురో:- అతడు పాపం, నేను చెప్పినట్టల్లా చేశాడు. శక్తి ఉబికించుకుని పని పూర్తిచేయటానికి దీక్షిణ్యమాను డయ్యాడు. అప్పటికే చేతులు పొక్కులెక్కిపోయినాయి అతనికి. సుకుమారప్రాణిలా కనబడ్డాడు...

రాజు:- ఎన్ని ప్రాణులకో ఆధారం కల్పించే మహాత్కా ర్యంగదా.

పురో:- అవును ప్రభూ, అయితే "సమయమయింది, మరొక్క పదిపారలు ఎగవెయ్యావోయ్"అని హెచ్చరించాను ప్రభూ! ఎన్నిమాటలన్నా ఓరిమితో సహించిన ఆ పనివాడు, ఇక జలపడుతుందనగా అదృశ్యుడైనాడు.

మంత్రి:- గురూజీ, మీరు చెప్పినట్లు అటువంటి దేవదూతలు వచ్చి, పని తీరిందంటే నిమిషంసేపు నిలవరు.

పురో:- కాదు, ప్రభూ, ఈ శుభవార్త చెవిని వేసికోకుండానే ఎక్కడకు వెళ్ళిపోయాడో, తెలియదు. పేరు రుద్రయ్య అని చెప్పాడు. జలపడిన తక్షణమే రుద్రయ్యని తమ సమక్షానికి తీసుకువచ్చి బహుమానం యిప్పిద్దా మను కున్నాను. కాని, ఆ గౌరవం నాకు దక్కించకుండానే మాయమైనాడు. పాకాల చెరువు రుద్రయ్యసృష్టి. అతడికి ఎటువంటి బహుమానమిచ్చినా కొద్దిపాటే అవుతుంది. ఇంతకీ, అతడు కనబడనేలేదాయె.

రాజు:- శివదేవయ్యా, వారు చెప్పినట్టు, రుద్రయ్యను వెతికి తెప్పించి, అతడికీ బహుమాన మిద్దాం.

మంత్రి:- గురూజీ! మన రాజ్యానికి తమవల్ల మరువరాని ఉప కృతి జరిగింది. పాకాలకు చేరిన అగ్రహారం తమకు దాన పట్టా వ్రాయించినారు ప్రభువులు. శ్రీవారు స్వహస్తాలతో అనుగ్రహిస్తున్నారు. స్వీకరించండి.

పురో:- మహాప్రసాదం...ఈ హస్తాలతో...ఈ హస్తాలతో... మహాప్రసాదం! తమరేనా ప్రభూ! రుద్రయ్య! కాకతీయ ప్రతాపరుద్రులు...!

[ సమాప్తి ]

# మాటల పోగు

పాత్రలు

సుందరం
వెంకటేశం
మంగమ్మ
సత్యవతి
కోట్నీస్
మాష్టారు
శిష్యుడు
వెంకటేశం తల్లి
సుందరం భార్య
సినిమా డైరక్టరు

---

* విజయవాడ కేంద్రమునుండి ప్రసారితం.



# మాటలపోగు

వెంకటేశం యిల్లు

[ సుందరం — వెంకటేశం ]

సుందరం:—అలా దారికి రావోయ్, వెంకటేశం! మనం చెప్పిన మాటా...వేదాక్షరమనుకో.

వెంకటేశం:— మీరు చెప్పిందంతా నాకు నచ్చింది మేష్టారూ. అ—యి—తే.

సుం:— నసుగుతున్నా వేమిటీ? గొప్పా బీదా అనే తారతమ్యం లేకుండా, ఉపకారంచేసే వుద్యమం ఇది ఒక్క—టేనంటే నమ్ము. గొప్పవాళ్ళు ఈ వుద్యమానికి ప్రోత్సాహమిచ్చి, పేదలకు ఆదర్శప్రాయులుకావాలి. ధనవంతులు నెవకడుగు వేశారంటే, అసలు ఉద్యమమే నామరూపాలు లేకుండా పోతుంది. అందులోనూ నీవంటి ఉత్సాహపూరితులయిన యువకులు అవసరం, మన వుద్యమానికి. ఇంతకూ, నీకు పట్టుకున్న సంశయమేమిటో తెలిస్తేకద...

వెం:—మీరు చెప్పిందంతా నాకు నచ్చింది మేష్టారూ. అయితే ఇటువంటివాటిల్లో...మా అమ్మగారు...

సుం:— ఓశ్, దీనికేనా జంకుతున్నావు. అమ్మగారిదగ్గరకు నన్ను తీసుకువెళ్లు, వెంకటేశం! నేను చెప్పిందంతా, అక్షరాలా రైటు అని ఆమెచేతనే వప్పిస్తా. పద, ఒక్క—సారి వారి దర్శనం చేసుకుని, నీ విషయంకూడా మాటాడుదామని ఎంతకాలంనించో వున్నది మనస్సులో.

## వెంకటేశం యిల్లు

[ సుందరం – మంగమ్మ ]

సుందరం:– చూశారా పిన్నిగారూ! నా చేతికింద ఇంచుమించు, కొన్ని వేలమంది విద్యార్థులు తయారై వెళ్లారనుకోండీ. అయినా, తమ్ముడు వెంకటేశం విషయంలో మొదటినుంచీ నాకు...అదేదో ఒక గొప్ప భవిష్యత్తు గోచరిస్తూనే వున్నది. అందుకనే, ఇప్పుడు నేను పనికట్టుకు రావడం...

మంగమ్మ:– యేమిటో, కుఁరకుంక......మరి, మావాడు పరీక్షలో నెగ్గుతాడంటారా, అబ్బాయిగారూ ?

సుం:– ఎంత మాటన్నారూ ? వెంకటేశం గాకుంటే, అసలు క్లాసు మొత్తానికి నెగ్గేవాడెవడూ అంట. అయినా, ఈ రోజుల్లో స్కూలుపరీక్షలకి విలవే లేదండి. పరీక్షలకేం, నా అనుభవాన్నిబట్టి ఒక్క సంగతి చెప్పగల. మన వెంకటేశం, ఒక అద్భుతమయిన పని యేదో చేసేసి, పేరు తెచ్చుకుంటాడు. అటువంటి లక్షణాలున్నాయి,అతనిలో...

మం:– పోనిస్తురూ, వాడిమొహం, వాడు చేసేదేమిటి – ఏదో అబ్బాయిగారూ! నాకింక కావాలిసిందేమున్నది చెప్పండీ? వాడిని చూసుకొంటూ కాలక్షేపం చేయటమేగానీ. వాడి సదుపాయం కనిపెట్టటం, కృష్ణా రామా ! అనుకొంటూ రోజులు వెళ్ళబుచ్చడమున్ను...ఈమధ్యనండి, సుందరం గారూ ! మా వూరికో శాస్త్రుల్లుగారు వచ్చారండి. నెల రోజులాయె. రామాయణ కథ ప్రారంభించారండి.

ఆ మహానుభావుడు ఒక్కొక్కముక్క చెబుతూవుంటే...
ఆహా ఈ జన్మ ఎందుకా అనిపించేస్తుందండి.

సుం:- ఆహా కాదుటండీ. ఆ కథలోనే వున్నది అంతటి మహత్తు. నేనూ నండి, మేష్టరీ మానివేసిన తరవాత, మీలాగనే భక్తిమార్గంలో పడిపోయాను. నా మనస్సంతా మారిపోయింది. మునపటి సుందరాన్నే కాను, ఇప్పుడు! మాయింట్లో ప్రతినిత్యమూ పురాణశ్రవణం, గీతాపఠనమూ నాగా లేకుండా జరగవలసిందే.

మం:- ఆహాహా, ఎంత పుణ్యమండీ.

సుం:- మానవజన్మ ఎత్తినందుకు కావాల్సిందేమిటి, పిన్నిగారూ? మనల్ని ఆశ్రయించుకొన్న వాళ్ళకీ, ఏదో ఇబ్బంది లేకుండా, ఇంత భూతాది కల్పించివేశామంటే మనకి నిశ్చింత, అంతటితో మన బాధ్యత తీరిపోతుంది...

మం:- నిజమేనండి. గొప్ప అనుభవంమీద చెప్పారు.

సుం:- ఈ సమస్య సాధించటానికే, పిన్నిగారూ! భుక్తి ముక్తి ప్రదాయకమైనటువంటి ఆలోచన ఒకటి చేశాను.

మం:- ఏమిటి బాబూ, అది? మీతోపాటు నాకుకూడా, తరించే ఉపాయం కాస్తంత సెలవియ్యండి, సుందరంగారూ!

సుం:- తరణోపాయమూ అని మెల్లిగా అంటున్నారా? ఒక్కటే సంగతి పిన్నిగారూ! వేదాంతంవిషయంలో మీ అభిప్రాయమూ, నా అభిప్రాయమూ పూర్తిగా ఏకీభవించేశాయి. మన హిందూశాస్త్రాలు ఏమని ఘోషిస్తున్నా

యండీ...'ఓయి పక్షీ! ఈజీవితం బుద్బుదప్రాయముసుమా ఇదంతా అశాశ్వతం సుమా. దీపం ఉన్నప్పుడే ఇల్లు చక్కబెట్టుకో సుమా!' అని వేదాలు మొదలు వేమన వరకూ ఇదే సూత్రం. ఏ మహాత్ముడు బోధించినా ఇదే ధర్మం... ఏమంటారు?

మం:- వేదాంతంలో వుండుకున్న అంతరార్థం ఎంచక్కా పట్టేశారండీ.

సుం:- నేను పట్టివేయడం మాట అటుంచండి. ఆధ్యాత్మికానికి మన దేశం పెట్టింది పేరు. మన దేశంలో వృద్ధులకంటె పసివాళ్ళకే వైరాగ్యభావం ఎక్కువ. ఆఖరుకి రెయిల్లో అడుక్కునే ముష్టివాళ్లుకూడా తత్వాలు పాడి, జ్ఞాననేత్రం తెరవగలరన్నమాట. ఇటువంటి మహత్తరమయిన మన జ్ఞానాన్నంతటినీ, పిన్నిగారూ! విదేశస్థులు పట్టుకుపోయి, మన నాలుగు వేదాలనూ మించిన అయిదో వేదాన్ని సృష్టించుకున్నారు. అదే భీమాశాస్త్రం...

మం:- ఈ శాస్త్రం ఎప్పుడూ విననే లేదండీ. నాలాటిదానికి ఎవరు చెబుతారు, అబ్బాయిగారూ!

సుం:- ఇదండీ...ఇహాపర సాధకమైందీ, పరమ పవిత్రమయినదీ భీముడు సృష్టించినటువంటిదిన్నీ...

మం:- ఆహా!...అదొక మాటా ఎంత గొప్పదీ కాకుంటే, భీముడు సృష్టిస్తాడూ...

సుం:- దీన్ని అవలంబించుతున్నవాళ్ళూ, వాళ్ళని ఆశ్రయించు

కున్నవాళ్ళూ ఈ ఉద్యమాన్ని ప్రచారం చేసినవాళ్ళూ, ప్రోత్సహించినవాళ్ళూ అందరూ తరించిపోతా రనుకోండి. ఈ సంగతులన్నీ తమ్ముడు వెంకటేశానికి వివరంగా విప్పి చెప్పాను. అమ్మగారి నడిగి, మనమూ అవలంబిద్దాం అన్నాడు. వయసుకి చిన్నవాడే అయినా, మీ ఎదట అనకూడదుగానీ పిన్నిగారూ! తమ్ముడికి, మీరంటే ఎంత భక్తి! ఎంత వినయము!

మం:- ఏం వినయమండీ! అబ్బాయిగారూ, మీకు తెలియదు గానీ...

సుం:- మీ మాటకి అడ్డువచ్చాను. దేశబంధు చిత్తరంజన్ దాసు పేరు వినేవుంటారు. మన స్వరాజ్యంకోసం సర్వమూ ధారపోసిన త్యాగమూర్తులలో ఆ మహానుభావుడు ఒకడు. ఆయన పోయేసరికండీ...గడించుకున్న ఆస్తి గుడ్డిగవ్వ యినా మిగల్లేదు. యాదాలాపంగా, ఆయన భీమాలో ఏం నాలుగు రాళ్లు కట్టాడో, అవే కొన్ని వేలు అయివచ్చి వారి కుటుంబాన్ని శ్రీరామరక్షగా కాపాడినాయి. విన్నారా? మనమయినా, ఇంతాచేసి ఏపాటిభాగ్యం? నెలకు ఒక్క నాలుగు రూపాయలు మనవి కావు అనిచెప్పి, అవతల పారవేశామంటే, అవే మన ఆశ్రితులకి ఆధార మవుతాయి.

[ రికార్డు సంగీతం ]

మం:- చూశారా బాబూ! మావా డేదో బుద్ధిమంతుడు అంటెరి, అదుగో అదే వరస. అస్తమానం ఆ రాగాల

పెట్టి ముందరపెట్టుకూర్చుంటాడు. ఇప్పటికాలపు కుర్ర వాళ్ళని మందలించటమూ కష్టమే. ఈ మధ్య ఏదో ఇంకో గొడవ మొదలెట్టాడండి సుందరంగారూ! శనీమాలుట, అవేవో — వాటిల్లో చేరాలనీ, ఇందుకోసమని, ఎక్కడలేని డబ్బూ, పిచ్చిగా...

సుం:- అరె, ఈ సంగతి ఎప్పుడూ చెప్పారుకాదేమిటి? సంగీతసాధనా, సినిమా నటనా, ఇవి సామాన్య విషయా లనుకుంటున్నారా యేమిటి? అసలు, మానవుడికి గంధర్వ కళ అనే హాంశ ఉండాలి. ఉంటేనేగాని, ఇటువంటి ఆసక్తే పుట్టదు. మనవాడి కెలా పట్టుపడిందో కానీ, ఇది కేవ లమూ, వరప్రసాదమే అనుకోండి పిన్నిగారూ?

ఇంకొక విషయం గమనించారో లేదో! ఏదయినా, పరమేశ్వరుడి విలాసంగానీ, మన చేతుల్లో ఏమున్నదండీ? తమ్ముడికి సినిమాసరదా కలగటం, నేను ఈ భీమా ఉద్య మం ఇప్పుడే ప్రారంభించడం, ఎల్లా ఉన్నదంటే — పండూ పండింది, కాకీ వాలింది — అన్నట్టుగావుంది. కలిసి వచ్చే కాలానికి...అన్నీ అలా అమరిపోతాయి కామాలు!

మం:- అంతేనండి అబ్బాయిగారూ! మనలో యేముందీ...

సుం:- ఇప్పుడు మనం పనిచేస్తున్న భీమా కంపెనీ వుందే, ఆ కంపెనీ మేనేజరుకీ, మెడ్రాసులో వున్న సినిమా డైరెక్ట రుకీ ప్రాణస్నేహం. అందుకనీ, మనకి మంచిబలం ఏర్పడు తుంది. ఇంకెందుకూ? తమ్ముడికి సినిమా సరదా తీరిందేనని

లెక్క వేసుకోండి. ఉన్న కిటుకల్లా ఒక్కటే; మనవాడు భీమాలో మెంబరీ అయినాడంటే, మా మేనేజరుచేత ఆ సినిమా డైరెక్టరుకి అద్భుతమైనటువంటి ఒకటోరకమయిన సిఫారసు చేయిస్తా.

మం:- మీ రెలా అయినా, అమృతహస్తమండీ సుందరం గారూ! సంకల్పసిద్ధులు. ఏమో, మీ నోటి వాక్యాన...

సుం:- సంశయ మేమీ లేదు పిన్నిగారూ! నాకు బాగా ధైర్యంగా వుందిప్పుడు; మన వెంకటేశాన్ని కంటితో చూస్తే, మళ్లా వొదుల్తాడటండీ ఆ డైరెక్టరూ...ఇంకో చిన్న విషయం చెప్పమన్నారా? 'సాబూ' అని, మైసూరు రాజ్యంలో ఒక పిల్లవాడు వీధులంట తిరుగుతూ వుండేవాడు. సీమనించి ఒక సినిమా డైరెక్టరు వచ్చి, ఆ దారిని పోతూ పోతూ, సాబూని చూశాడు. మరి, ఆ కుర్రవాడిలో ఏమి లక్షణాలు కనిపెట్టాడో యేమో, వాడిని వాళ్ళదేశం తీసుకుపోయాడు. ఆ కుర్రవాడు ఈ రోజున ఒక గొప్ప యాక్టరయినాడు. వాడిపయిన కనక వర్షం కురిసిపోతూంది. కాగా, ఇప్పుడు సాబూ, కోట్లకు పడగ లెత్తి కూర్చున్నాడు. దశ ఎత్తుకుంటే, ఎంతసేపు కావాలండీ? మన వెంకటేశం, గొప్ప సినిమా యాక్టరై పోయి, డబ్బుకి డబ్బూ, కీర్తికి కీర్తీ సంపాయిస్తాడు, చూస్తూ వుండండి. ఫలానారోజున సుందరం అన్నాడనుకొందురు గాని...

మం:- ఏదో అబ్బాయిగారూ! అంతా మీ చేతి చలవ...

సుం:- నాదేమున్నదండీ? నా విధి నేనెలాగా నెరవేర్చు కుంటాను. అసలు, జరగవలసిన పనంతా మీ చేతుల్లో వుంది. తమ్ముడికి భీమాలో పట్టాపుట్టడం, అతను సినిమాలో చేరడానికి డైరెక్టరుచేత ఊఁ అనిపించటం, ఒక్కమాటే జరుగుతయనుకోండి.

మం:- మా శ్రేయస్సు కోరినవారు మీరూ. ఏది మంచిదని తోస్తే, అలాగే చేయించండీ, సుందరంగారూ!

సుం:- నాకు మొదటనే తెలుసు, పిన్నిగారు నామాట కొట్టివేయరనీ. అయితే, రేపు దశమీ బుధవారంనాడు తమ్ముణ్ణి మద్రాసు ప్రయాణం కమ్మనండి. బస్తీలో ఎక్కువ సొమ్ము దగ్గిరుంచుకోవటం మంచిదికాదు. చేపట్టుకి అంథాకా రెండు పచ్చ కాగితాలు పట్టుకోమనండి చాలు. ఎప్పుడు కావాలంటే అప్పుడే పంపిద్దుడుగాని!...మరి, వెళ్ళొస్తా పిన్నిగారూ! నమస్కారం.

సుందరం యిల్లు

[ సత్యవతి – సుందరం ]

సత్యవతి :- ఇవాళేమిటో, ఆలోచనపర్వంలో పడినట్టుందే, పంతులుగారూ...

సుందరం:- ఆలోచనపర్వం ఒక్కటే కాదు, కవిత్వపర్వంలో కూడా పడుతున్నారు...మన వెంకటేశాన్ని చూచివద్దామనుకున్నానా? బయల్దేరిన వేళావిశేష మేమిటోకానీ, తలవనితలంపుగా, అతని తల్లిగారి దర్శనం లభించింది.

ఆవిడ మహాభక్తురాలూ, పరమవేందాంతిన్నీ. ఈ సంగతి మన కెప్పుడయితే తెలిసిపోయిందో, సైకాలజీ ప్రయోగించి, ప్లేటు మార్చేశాను.

స:- తలలు మార్చేవాళ్ళకి ప్లేట్లు మార్చటం లెక్కేమిటి లెండి.

సుం:- భీమాశాస్త్ర మనేది మన నాలుగు వేదాలనూ మించిన గొప్పవేదము- అని చెప్పి, కథలతో సహా నిరూపించే సరికి...మన వేదాంతం టకీ మని ఆమె మనస్సుకి హత్తుకు పోయింది...ఇప్పు డింకొక గమ్మత్తు. నాటకంలో అంత ర్నాటకం ఒకటి పుట్టుకొచ్చింది, మన అదృష్టవశాత్తూ. వెంకటేశానికి సినీమాలో నటిద్దామని పిచ్చి ఒకటి పట్టు కున్నది. ఇదే మన బిజినెస్‌కి ప్రాతిపదిక అయింది. ఇప్పుడు వాడిని మద్రాసు తీసుకపోయి, సినిమాలో చేర్పించవలసిన పనికూడా మన భుజస్కంధాలపైన పడింది. రేపు దశమీ బుధవారంనాడే ప్రయాణం పెట్టాను. ఒక్కదెబ్బకు రెండు పిట్టలన్నట్టు వచ్చింది, మన వ్యవహారం...

స:- రెండేకాదు, ఎన్ని పిట్టల నయినా కొట్టగలరు. మాట లతో కోటలు కట్టగలవాళ్ళకి సాధ్యంకాని దేముందీ.

సుం:- నువ్వూ అదేమాటన్నావూ? మనిషికి వేషం, భాష ఈ రెండూ రెండు భుజాలుకద. లేనినాడు, లోకంలో చెలామణీ యెలాగా?

స:- మీరు చెలామణీ కాకపోవడ మేమిటి? వేషానికి వేషం, దానికి మించిన భాషా...

సుం:- సరేలే! ముందు ప్రయాణ సరంజామ కావలసిన వేవో చూసుకోవాలి. పద!

[ కోట్నీస్ – సుందరం ]

కోట్నీస్:- వాళ్ళంతట వాళ్లు ఇష్టపడి, సంసారులు మొగ్గిన నాడు కానీ...సినిమా రంగం...

సుందరం:- మొగ్గలేదంటే, అది వాళ్ళపొరబాటు కాదంటాను. అసలుకీలకం మనం తెలుసుకోనేలేకపోయినా మన్న మాట. దేశాభ్యుదయానికిగాను ఒక మహత్తరకార్యం తలపెట్టా మంటే, తగిన సహకారం ఎందుకు లభించదండీ.

కో:- ఏమో ఇంత ధైర్యంగా చెప్పగలిగినవాళ్లు నా కిప్పటి వరకు కనపడ లేదు.

సుం:- మిస్టర్ కోట్నీస్! నేనూ చూపిస్తా, మీరు కోరిన వాళ్ళను. ఈ విషయంలో ఎంతకృషి చేశాననుకున్నారు? మీ దర్శనంచేశాక, నాకృషి సార్థకమవుతుందని ఇప్పుడు ధైర్యం కలిగింది నాకు...ఇప్పుడూ...

కో:- అయితే, సుందరంగారూ! మీ దృష్టిలో ఎవరయినా...

సుం:- ఉండడమేమిటీ తరతరాలుగా కళారాధకులయినటు వంటి ఒక ఫ్యామిలీ యావత్తూ మీ యెదుట పెట్టగలను కావాలంటే...

కో:- ఓ...కే...తపఃఫల మన్న మాట.

సుం:- మరేమిటనుకున్నారు. మా వూరికి సమీపంలోనే ఒక కుర్రవాడున్నాడు. మన్మథరూపం...కోకిల కంఠం...ఇంత

కంటే ఏం చెప్పమంటారూ? అతడు మన శిష్యుడు కూడాను. అదృష్టవశాత్తూ.

కో:- ఒక్కసారి చూస్తే బాగుండునే...

సుం:- చూదురుగానీ...మరి వచ్చి...అతని సిస్టర్సు ఇద్ద రున్నారు. వాళ్ళూ మంచి విద్యావంతులూ, భరత నాట్యంలో నిధులున్నూ. ఇంకేంగావాలి మీకు?

కో:- స్ప్లెండిడ్ !

సుం:- అయితే, వీళ్లు మన కంపెనీలో నటించటానికి ఎలా ఆకర్షించడమూ అనేది సమస్య. చెప్పొద్దూ? దీనికి ఒక చిన్న తిరుగు డున్నది. ఆ కుఱ్ఱవాడి బంధువు ఒకాయన ఇన్సూరెన్సు కంపెనీకి డైరెక్టరు; ఆయనెంత చెబితే అంత, పిల్లవాడి తల్లి. కనుక- ఆయనకు చేతినిండా మనం బిజినెస్ కల్పించగలిగాము అంటే, మన ఉద్యమం నెరవేరినట్టే...

కో:-దానికేముంది, బ్రహ్మాండం! మన స్టాఫ్‌చేతా, యాక్టర్సు చేతా తలా వక పాలిసీ కట్టిద్దాం. ఇటువంటి ఛాన్సు తగిలినప్పుడు జంకుతామా?

సుం:- వాళ్ళదాకా ఎందుకు? తలుచుకుంటే, మీ రొక్కరే చేయగలరు, ఓ పదివేలకి...

కో:- ఓ యస్. అలాగే చేదాం...మరి, ఆ కుఱ్ఱవాళ్ళను ఎప్పుడు రప్పించడం?

సుం:- అదంతా నేను ఏర్పాటు చేస్తాకదూ. మరి సెలవు. మిస్టర్ కోట్నీస్, నమస్తే...

కో:- నమస్తే.

[ సుందరం – వెంకటేశం ]

వెం:– మేష్టారూ! ఏమిటి, పండా? కాయా?

సుం:– హాc. కాయా? మొదటినుంచీ నీకీ సంశయమే పట్టు కుంది...వేశాం, కోటలో పాగా. నిన్నెప్పుడు చూస్తానా అని డైరక్టరు తహతహలాడిపోతున్నాడు. వ్యవహార మెప్పుడూ బింకంగా వుంటేనే మోజు. రెండురోజులు ఆగి, మరీ వెడదాం. చెప్తాగా, దానిలో వుండే కిటుకూ...

వెం:– థాంక్స్ మేష్టారూ! థాంక్స్.



# క్షమాపణ



## పాత్రలు

| | |
|---|---|
| ఆనంద్ | వర్తకుడు |
| గౌరి | భార్య |
| డ్రైవరు | |
| పోలీసు ఇన్స్పెక్టరు | |
| వార్డరు | |
| ఖైదీలు | |
| రంగడు | ఖైదీ, నేరస్థుడు |
| జైలు అధికారి | |

---

ఇతివృత్తం : టాల్‌స్టాయ్.

# క్షమాపణ

## ఒకటవ రంగం

ఆనంద్ — గౌరి

ఆనంద్:— ఏమిటో నీ పిచ్చి! చదువుకున్నావన్న మాటే గానీ...ఈ మూఢ నమ్మకాలింకా...

గౌరి:— మూఢనమ్మిక కాదండీ...అంతా కళ్ళకి కట్టినట్టుంది. నామాట కాస్తంత చెవిని పెడుదురూ...

ఆనంద్:— వ్యాపార మంటే వ్యవసాయం మోస్తరుగా అదనూ పదునున్నూ. కన్ను మూసి తెరిచేలోపల లక్షలొస్తాయి, లక్షలుపోతాయి. తెలుసా? ఇట్లా మీనమేషాలు లెక్కెడుతూ కూర్చుంటే కుదురుతుందా?

గౌరి:— ఇన్ని గాక యిన్ని చెప్పండీ...ఈ దఫా మీకు బయల్దేరాయిస్తి కాదు. నాకు భయమవుతున్నదండీ!

ఆనంద్:— పదేళ్ళనించి కాపరం వెలగబెట్టుతుంటివి గౌరీ! ఇవాళ భయమా? బొత్తిగా చిన్నపిల్లలకిమల్లే...బాగానే వుంది...

గౌరి:— అమ్మో! ఆ స్వరూపం!! తలుచుకుంటేనే వళ్లు జల్లుమంటూంది...

ఆనంద్:— నీ వంటి వీరమాత లుండబట్టే...హాఁ! అస లింతకీ ...ఆ కల యేమిటో చెప్పనే చెప్పవైతివి...

గౌరి:— అబ్బ! యేం చెప్పేదండి, పాడుకల...

ఆనంద్:— పాడో, బాగో నాకు తెలియొద్దూ!

గౌరి:- మామూలుగానే మీరు క్యాంపు వెళ్ళి వచ్చారండీ... కాళ్లు కడుక్కొని, టోపీతీసి పాగాకొయ్యకి తగిలించేసరికల్లా...తలంతా నెరిసి ముగ్గుబుట్టలా అయిపోయిందండీ... (యేడ్పు)

ఆనంద్:- (చిరునవ్వుతూ) అశశ్! దీనికేనా ఇంతబెంగ! ఆఁ? ఇదుగో చూశా...గౌరీ! తెల్లవర్ణం కలలో కనబడ్డం ఎంతశుభసూచక మనుకున్నావ్? నువు కోరుకున్న బహుమతులు తీసుకువచ్చి ఎదట బెట్టేసరికి...తెల్లబోతావన్నమాట! చూదుగాని, మజా...ఇహ మరి నన్ను అడ్డుపెట్టకు...

...డ్రైవర్! స్టార్ట్.

గౌరీ! (వీపుమీద తట్టుతూ) నీకొచ్చిన భయం ఏమీ లేదు. నువు చెప్పినవన్నీ పట్టుకుని...పదిహేను రోజులకల్లా రాకపోతే అడుగు...

చిన్ని బిడ్డ:- సరిగ్గా ఇరవై అయిదో తారీఖు, కాదునాన్నా!

ఆనంద్:- (బిడ్డని ఎత్తుకుని) అవును నాన్నా!... ఇరవై అయిదు. కాలెండరుమీద అప్పుడే మార్కుచేశావే, దొంగా! యేది, చెల్లాయేది! హల్లో, బేబీ! ఏదో ఒక వేలు పట్టుకో, తల్లీ!

[కారు స్టార్ట్ అయిన ధ్వని]

రైటో! పాపని తీసుకో, గౌరీ!

[నిష్క్రమణ]

## రెండవ రంగం

[ కారు వెళుతూండగా టైర్ పేలిపోతుంది ]

ఆనంద్:- అరెరే! టైరు పోయిందే! మొన్ననే కదుటోయ్ వేసింది?

డ్రయివరు:- ఈ రోడ్డింతే బాబూ! ఎంతసేపు లెండి, కొత్త టైర్ వేశేస్తా. తమరు అట్లానే కూచోండి, దిగొద్దు...

ఆనంద్:- ఏం కూర్చోడమోయ్! భోజనాల వేళకి కాకినాడ చేరుకోవలసింది. పదకొండింటికి ఒక పెద్దమనిషిని కలుసుకుంటానని వైర్ కూడా యిస్తినీ...పోనీ, చూడబోతే అనకాపల్లిలో పనీ అట్లానే అయిపోయింది. యేమిటో, లేచిన వేళావిశేషం...

డ్రయివరు:- అయిపోయింది, సార్!

## మూడవ రంగం

[ మూడురోజుల తరవాత ]

తునిమకాం: గణపతివిలాస్ హోటల్

ఆనంద్:- డ్రైవర్! చూడు...మనం సాయంకాలం నాలుగ్గంటలకల్లా కాకినాడ ట్రావెలర్సు బంగాళా చేరుకోవాలె. మునపట్లా చెయ్యకా...టైర్లూ గీర్లూ రైటుగా చూసుకో.

ఇదుగో హోటల్ బిల్లు ఎంతయిందో కనుక్కుని, అయ్యరు కిచ్చేశెయ్యి.

[ రికార్డుపాట: 'రావే-రావే-బంగరుపాపా!' ]

## నా లు గ వ రం గం

[ పోలీస్ ఇనస్పెక్టరు కాన్స్టేబిల్సు కార్లుమీదవచ్చి హోటల్లో ప్రవేశం ]

ఇనస్పెక్టరు:- అయ్యర్వాళ్ ! ఇక్కడి కెవరయినా వర్తకు డొచ్చాడా, అనకాపల్లినుంచి ?

గణపతిఅయ్యరు:- రూమ్ నం. 23 లో ఒకాయన వున్నాడు, సార్ ! ఆంధ్రామర్చంటు. అదుగో, రికార్డుపాట వినబడు తూండలే ! అక్కడదా...

## ఐ ద వ రం గం

[ రూమ్ నంబరు 23 ]

ప్రవేశం : ఇనస్పెక్టరు — కాన్స్టబిల్సు

ఇ:- హల్లో ! తమ రెక్కణ్నించి వస్తున్నారు సార్ ?

ఆనంద్:- అనకాపల్లినుంచి ...... లోపలికి దయచెయ్యండి! ఫ్యాన్ ! కాఫీ...

ఇ:- ఓ ! నో ! యేమీ అక్కర్లేదు. తమ రిక్కడికి వచ్చి ఎన్నాళ్ళయింది ?

ఆనంద్:- మొన్న నేనండి. మధ్యాహ్నం వొంటిగంటన్నరకి.

ఇ:- మీ తరువాతి క్యాంపు ?

ఆనంద్:- కాకినాడ. ఇవాళనే, కాశేపుండి బయల్దేరదా మనుకుంటున్నా.

ఇ:- ఏం బిజినెస్ చేస్తారు సార్, మీరు ?

ఆనంద్:- పీస్‌గుడ్స్, లాలిమ్లీ, ఎల్జిన్ మిల్సుకి డిస్ట్రిబ్యూటర్ని, కర్నాటిక్ బకింగ్‌హామ్ మిల్సు ఏజన్సీ మొన్ననే

తీసుకున్నాము. ఇదిగాక, చైనాసిల్క్సు డైరెక్టుగా తెప్పించి...

ఇ:- సరే, మీ పేరు ?

ఆనంద్:- ఆనంద్, బి. యస్.

ఇ:- ఓ ! అల్లాగా ! తమ నేటివ్ ప్లేస్ అనకాపల్లేనా ?

ఆనంద్:- కాదు. మాది అసలు ఖాశింకోట. అక్కడ మాకు జమీందారువా రిచ్చిన అగ్రహారం అదీ...

ఇ:- అది సరేకాని, అయ్యా ! పోయిన రాత్రి తమరు ఈ గది లోనే పండుకున్నారా ?

ఆనంద్:- ఆc.

ఇ:- అయితే, మీతోకూడా మరొకాయన వుండిరికదూ ?

ఆనంద్:- అవును. ఆయనా నేనూ కలిసే భోంచేశాం రాత్రి. నిన్నను కాఫీకూడా కలిసే తీసుకున్నాం. ఆయనది ఈ పక్కగదే, పోయి చూడవచ్చు.

ఇ:- వారు మీ కీవుదయం అవుపడ్డారా ?.

ఆనంద్:- లేదు, ఇంకా యిప్పటికి రాలేదు. కాని, ఎందుకు సార్, ఇట్లా నిలదీసి అడుగుతున్నారూ, ఏదో దొంగ నైనట్టు ?

ఇ:- మీ స్నేహితుణ్ని ఎవరో ఖూనీ చేశారండీ.

ఆనంద్:- ఏమిటీ ? ఖూనీ !...

ఇ:- ఔను అందుకనే, ఇప్పుడు మీ రూమ్ సర్చి చేయాల్సి వుంది.

ఆనంద్:- ఏమిటి సార్ ! ఖూనీయా ? ఖూనీ ! !

ఇ:- జవాను! చూడు! ఆ వెనక తలుపు సీలు వెయ్యి. ఈ మూలనించి ప్రారంభించు.

[సామాన్లు తిరగేసిన సందడి. కొంచెం సేపయినతరవాత]

ఇ:- ఏమండీ! ఆనంద్‌గారూ! యిదేమిటి సార్, ఈ కత్తి?

ఆనంద్:- ఏమిటీ! కత్తి...అబ్బా! ఏమిటా నెత్తురు!! నే-నె-ర-గ-ను సార్, నాది కాదు సార్!...

ఇ:- అయ్యో! మీరు చదువుకున్నవారు, ఘరానా మనుష్యులు, లక్షలమీద వర్తకం చేస్తున్నారు, ఎందుకండీ అసత్యమాడతారు?

నిన్నను మీ రుభయులూ కలిసి కాఫీ తీసుకుంటిరి, కలిసి భోజనం చేస్తిరి. ఉదయమయ్యేసరికి ఆయన పీక తెగి పడివున్నదంటే మీ కేమీ తెలియదంటారే! ఏమనుకోవాలె? ఈ కపటనాటకం ఎందుకు, ఆనందుగారూ? నెత్తురు ఓడుతున్న కత్తి మీ సామానుల్లో దొరికినా, డబాయిస్తారే? మీ వాలకం చూస్తేనే తెలుస్తూంది. చెప్పండి, నిజం చెప్పెయ్యండి.

ఆనంద్:-ప్రమాణపూర్తిగా నే నే పాపమూ ఎరగను సార్! రాత్రి పదకొండున్నరకు ఎవళ్ళ పడకగదికి వాళ్ళం వెళ్ళిపోయామండీ. తరవాత మళ్ళీ మేం కలుసుకోలేదండీ. ఈ కత్తి నాదికాదు సార్, నాది కానేకాదు సార్!

ఇ:- జవాను! ఈయన్ని రిమాండ్‌లో వుంచు.

[అరెస్టయిన ఆనంద్ ఏడుస్తూవుంటాడు]

## ఆరవ రంగం

[జైలుగదిలో యింటర్వ్యూ]

గౌరి:- నా కా పీడకల వచ్చినందుకు పూరికే పోయింది కాదు గదా ! ఆ రోజున ప్రయాణం మానేస్తే ఎంత బాగుండే దండీ !

ఆనంద్:- యేమిటో నీ పిచ్చి !

*" రాకస్మానవు హాని వృద్ధులు మహా*
*రణ్యంబులో డాగినన్*
*.............................. "*

హ్ఁ ! ఊరికే చెప్పాడా మహానుభావుడు !

గౌరి:- అయినా, వద్దండీ అని పోరినా, చవితిచంద్రుణ్ని చూడటం మానరయితిరి... కాకపోతే ఏమిటి, ఏపాపమూ ఎరగనివాళ్ళమీద ఈ అపవాదు... !

ఆనంద్:- పాపం చెయకుంటే అనుభవం యెందుకొస్తుందీ ? ఎవడికర్మకి వాడే కర్త... కాని,

గౌరి:- మని షొక మాటగా చెబుతూ వచ్చారు. ఏమాటా నమ్మటానికీ మానటానికీ యేఁపీ పాలుపోయింది కాదు. అర్జీ పెట్టుకుంటే 'వీల్లేదూ' అని చెప్పి కాయితం తిర గ్గొట్టేశారు అధికారులు.

ఆనంద్:- ఉద్యోగధర్మం...

గౌరి:- అమేసరికి- పక్కింటాయన కాళ్ళమీద పడి బతిమి లాడితే, పాపం, ఆయ నొచ్చి సిఫారసు చేశారు. లోపలికి రావచ్చని ఇవాళే.

ఆనంద్:- మరి జెయిల్‌కీ యింటికీ భేదమేమిటనుకున్నావ్ !

గౌరి:- అయితే, మనం చెయ్యాల్సిం దేమిటండీ?

ఆనంద్:- చేసే దేముంది...చక్కా- అనుభవించడమే...

" అవశ్య మనుభో క్తవ్యం
కృతం కర్మ శుభాశుభం"....

గౌరి:- మీ వెర్రివేదాంతమే మన కీ స్థితికి తెచ్చింది...

ఆనంద్ :- అదే పొరపాటంటాను. మీ గడుసుదనాలూ, కుయుక్తులూ విధివిలాసాన్ని సడలించలేవు. అయినా, నాకు పట్టుకున్న విచారం ఒక్క-టే: నా పాపం నాతో పోవటం లేదుకదా అని...

గౌరి:- ఏం మాటలు పోనిస్తురూ... పోనీగాని, నాతో నిజం చెప్పండీ...ఆ చంపింది మీరు కాదూ?

ఆనంద్:- ఏమిటీ! గౌరీ! గౌరీ!! నువ్వ్యా న న్ననుమా నిస్తున్నావా? ఛశ్ ! పాడు జీవితం ! కన్న తల్లికీ, కట్టు కున్న భార్యకే నాపయిన నమ్మకం లేకపోయింది, హాఁ? కూట సాక్ష్యాలమీద ఆధారపడే కోర్టుకా నిజం తెలిసేది! ఇది మాయలోకం! ఇదంతా మిథ్య!!

గౌరి:- అట్లా మనసు చెదరకొట్టుకోకండీ...మాకు గుండె బేజారై పోదూ?

వార్డరు:- ఏందమ్మా గోల! అయ్యవోరు కోంబడతారు. బయిటికి పోమ్మా.

గౌరి:- ఉండు నాయనా! నీకు బిడ్డల్లేరూ?

వార్డరు:- పోమ్మా ముందూ.

[ గేటు వేశేస్తాడు ]

## ఏడవ రంగం

ద్వీపాంతరం

[ఇరవై ఆరేళ్ళ అనంతరం కొత్తగుంపు దీవుల్లోకి దిగింది]

రంగడు:- ఆవేళ కొత్తమావాస్య తీర్థం. ధుమా యెగిరిపోతా వుంది. అక్కడే ఒక సారటు బండి రెడీగా నిలబడివున్నది. అందులో యెవ్వరూ లేరు. నాకు అర్జంటుపని తగిలింది. 'అటునించి నరుక్కొద్దా' మనుకుని, బండీ యింటికి తోలుకుపోయా. తోలుకుపోయా...అక్కడనే ఆమట్టున వదిలేశా. ఇదీ నే చేసినతప్పు. దొంగతనం నేరం మోపి, నన్ను బట్టి శిక్షించారు.

ఒకరు:- ఈపాటిదానికే?

రంగడు:- ఇంతకీ ఈపని సారటువాడికి సమ్మతమే. వాడికీ నాకూ ప్రాణస్నేహం. అంచేత, 'కందకు లేని దురద బచ్చలి కెందుకయ్యా?' అని నేను వాదించాను.

ఒకరు:- సబువుగానే చెప్పావే...

రంగడు:- మన సబువులు చెవిని పెట్టేపాటి పెద్దమనుషు లెవరూ? 'అదంతా మాకు తెలియదూ, నువ్వు దొంగ వని జూరీలు తీర్పు చెప్పారు' అని కోర్టువారు. వారి మాటకి తిరుగుందా?

కాదుగానీ మునుపొకసారి నిజంగా నేరం చేసేవున్నా. న్యాయానికి ఆనాడే నే నిక్కడికి రావలసింది. కాని, తప్పించుకు పొయ్యాను. ఇప్పుడు నేరం లేని శిక్ష...

(నవ్వుతూ) అన్నీ వుత్తమాటలే! ఈవరకప్పుడే వక పర్యాయం వచ్చేవున్నాను. పాత పిల్లినే!! కానయితే ఆట్టే కాలం వుండలేదులెండి.

ఒకరు:- మీ దేవ్రూ హా

రంగడు:- మాదా? అనకాపల్లిలో 'రంగడి' పేరు చెబితే, గుఱ్ఱాలు నీళ్ళు తాగవన్న సంగతి తెలియదూ?

ఆనంద్:- మీది అనకాపల్లిటండీ! మీ వూళ్ళో బట్టలవర్తకుడు ఒకాయన...

రంగడు:- అవును, ఆనందు. ఎరక్కేం? ఆయనకూడా పాపం, మాలాగ్గనే చిత్తాలోకి యెక్కి, యిక్కడనే వుంటున్నాడటగా? అయితేనేం కొడుకు లిద్దరూ నిక్షేపంలా కాలక్షేపం చేస్తున్నారు... తాతా...! నువ్వెందు కొచ్చినట్టూ?

ఆనంద్:- ఎందు కేమిటి (నిట్టూర్పు) చేసుకున్న పాపం కట్టికుడపదూ? ఏనాటి సంచితార్థమో, ఈ యిరవై ఆరేళ్ళనించీ...

రంగడు:- నేరం యేమిటని?

ఆనంద్:- ఏమీ లేదు. ఈ శిక్షకు తగివున్నాను గనకనే...

ఒకరు:-రంగంగారూ! ఆయన్ని మీరేమీ అడక్కండీ. వారు మాకు గురువులు. తాతాజీ అంటే అధికారులయినా సరే జోహారు చేస్తారు.

రంగడు:- కాదయ్యా, చేసిన తప్పు చెబితే పోతుందిగా? నే నెప్పలా?

ఒకరు:- వారు నేరం చేస్తే కాదుటయ్యా, చెప్పటానికి? ఎవడో తుచ్ఛుడు ఖూనీ చేసి, ఆ కత్తి మా తాతాజీ సామానుల్లో దూర్చి పొయ్యాడు. పాపం, అమాయ కంగా ఈయనకి యావజ్జీవశిక్ష పడి వూరుకుంది. నిరప రాధుల్ని శిక్షించే దేవుడూ...

రంగడు:- ఆ! అరె, తాతాజీ! ఎంత ముసిలివాడ వైపోయి నావ్!!

ఒకరు:- వారి నెరిగున్నట్టు చూస్తున్నారే, రంగంగారు!

రంగడు:- ఒకరి నౌకరు తెలుసుకోవటం ఎంతసేపూ?

ఆనంద్:- నన్నెక్కడయినా లోగడ చూచినజ్ఞాపకమున్నదా? ఆనంద్ ఖూనీకేసునుగురించి మీరు విన్నారుకాబోలునేం?

రంగడు:- నేను వినడమేఁవిటి, లోకమంతా గింగురుమని పోతూవుంటే...ఏం చెప్పగలం, లక్ష వదంతులు పాకి పోయినయి...అబ్బో! ఇదేనాటి ముచ్చట! నా కప్పుడే పరగడుపే అయిపోయింది...

ఆనంద్:- అయినా, ఆ చంపిం దెవరో మీకు తెలుసు నను కుంటాను?

రంగడు:- (పకపక నవ్వుతూ)

ఎవరూ అని అదో ప్రశ్నా? కత్తి యెవరి సంచీలో దొరికిందో, వాడే చంపివుండాలె! పోనియవయ్యా మరెవ

డయినా ఖూనీచేసి, కత్తి సామానుల్లో దాచినారే అను
కుందాం మాటవరసకి. అసలువాడు పట్టుబడేవరకూ
ముద్దాయివి నువ్వే...కాదుగానీ, నీ తలకింద పెట్టుకున్న
సంచీలో ఎవడొచ్చి కత్తి దూర్చగలడయ్యా ... అంత
బ్రాంతిగా...

ఆనంద్:- అవును, అవును.

[ నిష్క్రమణ ]

ఎనిమిదవ రంగం

[ జైల్లో ఒకనాటిరాత్రి ]

ఆనంద్:- రెండుఝాములు దాటింతరవాత నయినా నిశ్శ
బ్దంగా వుంటుందేమో, హాయిగా పండుకుందా మను
కుంటా. అబ్బా, యేమిటీ చప్పుడు !

కోటివిద్యలు నేర్చినా కూడుదొరకని కటికదరిద్రులు
ఆలుబిడ్డల్ని వొదులుకుని ఈ ద్వీపం చేరుకుంటారు. అటు
వంటిఅనాథజీవుల పొట్టలు చించుకొని తింటామంటాయి,
ఈ ఎలకలూ పందికొక్కులున్నూ ! ఒకొక్, అవి చేసే
ధ్వని ఎంతచిత్రం ! సరిగ్గా మనుషులు చేసినట్టే...

అ-యి-నా-పాపం, ఆ నోరు లేని జంతువులవయిన
నేను విసుక్కోవడ మేఁవిటీ ? —— పగలు మన సవరింపు,
రాత్రిపూట వాటి చక్కబెట్టూ !

[ ఢభీమని ఏదో కిందపడ్డ చప్పుడు ]

అరె! యేమిటో, కిందపడ్డట్టున్న దే!!...ఇది ఎలకల చడిలాగ లేదే...

రంగడు:– తాతా! మాట మాట. లోపలికి రా, చిన్న రహస్యం.

ఆనంద్:– ఉహుఁ...నువ్వు నా కేమీ చెప్పవద్దు.

రంగడు:– ఇదుగో, నే నిప్పుడు చేస్తున్న పని యేమి టను కున్నావ్! చిత్రమయిన కోరం వకటి సంపాయించా. దాంతోటి రోజూ రాత్రిళ్ళు కొంచెంగా గోడ దొలిచే స్తున్నా. మనిషి దూరటానికి సరిపడేటంతకన్నం కాంగానే ఈ పని కట్టిపెట్టేస్తా. విన్నావా!

అయితే, మరి ఈ మట్టి అంతా యేంచేస్తున్నావురా అబ్బాయీ అని అడుగుతావేమో...హాఁ నక్కకి జిత్తులు నేర్పాలీ? కాలి జోళ్ళల్లోటి యెత్తి పారబోసేస్తున్నా. ఇంత బ్రహ్మాండమైన పని చేసుకొస్తున్నానా, పిట్టకి తెలిస్తే వొట్టుపరి. కార్యం యీవత్తూ...వొంటిచేతిమీద సాగి పోతూందన్నమాట. చూశావా, నా చాకచక్యం!

కాని, తాతా! గప్‌చిప్‌గా వూరుకుంటివా, నువ్వు కూడా దాటిపొయ్యే వుపాయం చేస్తా. అలాక్కాదూ అంటావ్? అధికార్లు నా ప్రాణాలు తియ్యటానికి ముందే ...నీ ప్రాణాలు...జాగ్రత్త!

ఆనంద్:– (విదిలించుకుంటూ) వొదులు, చెయి వొదులు. తప్పించుకు పొయ్యే సంకల్పం నాకు లేదు. నువ్వు నా

ప్రాణాలు పుచ్చుకోవలసిన అగత్యం అంతకంటే లేదు. ఇరవై ఆ రేళ్ళ కిందటనే నా ప్రాణాలు బలికోరావు... అయితే, నిన్ను బయటపెట్టడమా మానడమా అనేది ఈశ్వరేచ్ఛ.

## తొమ్మిదవ రంగం

[ మర్నాడు ఉదయం. ]

జైలుఅధికారి:- "నువ్వు ?"

"తెలియదండీ."

"నువ్వు ?"

"నేనేమీ ఎరగనండి."

"నువ్వోయ్ ?"

"ఎబ్బే !"

అధికారి:- అందరూ పెద్దమనుషులే. మరి, ఈ కన్నం ఎట్లా వచ్చిందీ! ఇక్కడి కొచ్చినా, మీకు దుర్బుద్ధి మళ్ళ లేదుగా ? ఏం రంగడూ ?

రంగడు:- ఇప్పుడే విన్నానండి, ఈ గొడవ...

అధికారి :- అదుగో, సమయానికే వస్తున్నాడు, తాతాజీ. ఏమిటి, తాతాజీ! ఎన్నడూలేని అప్రతిష్ఠపని జరిగింది, మన జెయిల్లో. ఇంత స్వాతంత్ర్యం ఇచ్చి, బిడ్డలకంటె ఎక్కువగా చూస్తున్నప్పటికీ, వీళ్ళకీ గుణం పోలేదు, చూడూ.

ఆనంద్:- ఇటువంటి చెడు విత్తనాలు మనిషిలో ప్రవేశించకనే పోవాలె గానీ...

అధికారి:- అయితే, యీ విషయం నీవరకూ వచ్చిం దన్న మాట ? నువ్వు అబద్ధం ఆడవన్న సంగతి నాకు తెలుసు. నీకు అనుమాన మున్న పేరు చెప్పు...

ఆనంద్:- అనుమానం పొరపా టయితే ?

అధికారి:- అట్లా తప్పించుకుంటే కాదు, చెప్పే శెయ్యి.

ఆనంద్:- క్షమించండి. నేను చెప్పలేను, చెప్పను. ఏం చేసినా సరే తమ చిత్తం...

అధికారి:- చెప్పవయితే, తాతా !

ఆనంద్:- చెప్పలేను, క్షమించాలి.

అధికారి:- రాజద్రోహానికి పాల్పడుతున్నావు !

ఆనంద్:- అంతకు మించిన ద్రోహంకాదూ...పొరపాటున అనుమానించడం, అనుమానించి పొరపడటమున్నూ ?

అధికారి:- సరి...

## పదవ రంగం

[ఆనాటి రాత్రి – వొంటి గంటకి]

ఆనంద్:- అర్ధరాత్రివేళ యేమిటి నీకిక్కడ పని ? ఇంకా యేం చెయ్యమంటావ్, నన్ను ?

రంగడు:- ............

ఆనంద్:- ఏం, పలకవ్! వెళ్ళిపోతావా, గార్డుని పిలిచేదా?

రంగడు:- తాతాజీ! నన్ను క్షమించవూ?

ఆనంద్:- నేను క్షమించే దేమిటి!

రంగడు:-తప్పదు. ఆ కత్తి నీ సంచిలో దూర్చింది నేనే...నేనే ...ఆమహాపాతకుణ్ని నేనే...నేనే...ఆనంద్ క్షమించవూ?

ఆనంద్:- ............

రంగడు:- తా తా జీ! నేను తప్పొప్పేసుకుంటాను. నువ్వు యింటికి వెళిపోదుగాని...నన్ను క్షమించవ్?

ఆనంద్:- హుఁ! యిల్లూ, యిల్లాలున్నూ!! ఏనాడో మరిచి పోయాం, ఒకళ్ళనొకళ్ళం! నాకే తాపత్రయం లేదు...

రంగడు:- ఆనంద్! సమయం చిక్కినా, కసి తీర్చుకున్నావు కావు. ఎంత జాలిగుండె నీది, ఆనంద్!!

ఆనంద్:- కసి! కసి!! ఈ మూణ్నాళ్ళ ముచ్చటకోసం, మనిషిమీద మనిషికి కసి!!!

రంగడు:- ఎన్ని కష్టాలు పెట్టాను నిన్ను, ఆనంద్! నీ జీవితమే నాశనం చేసివేశాను ఆనంద్!!

[ విలపిస్తాడు ]

ఆనంద్:- రంగా! నేను పరమ పాపిని. ఆ పాపాలు అనుభవించటానికే నే జన్మించింది. నువు నిమిత్తమాత్రుడివి. ఎందుకు విచారపడతావ్? నిలకడమీదయినా నిజం

తేలింది, నా కది చాలు. ఆనందముతో జీవితయాత్ర చాలిస్తానిక. రంగా! నువు సత్యస్వరూపుడివి. ఈ రూపకంగా సాక్షాత్కరించావు. రంగా! నువ్వు పాండురంగడివి!! దొంగరంగడివికాదు, పాండురంగడివే!!!

[ మూర్ఛిల్లుతాడు ]

రంగడు:- ఆనంద్!

ఆనంద్:- రంగా! రంగా!!

[స మా ప్తి ]

# తెరచాటు

## పాత్రలు

| | |
|---|---|
| * శ్రీహరినాయుడు | కథానాయకుడు |
| టెంపరు పంతులు | శ్రోత్రియందారు |
| రమణరావు | 'టెంపరు'కు ప్రాణస్నేహితుడు |
| గోపన్న | దివానుగారి గుర్రపువాడు |
| సింహాచలం | దివానుగారి తోటమాలి |
| నాగన్న | 'టెంపరుగారి' నౌకరు |
| దేవానందం | స్కూలు మేష్టరు |
| జోగులు | పేదరైతు |

---

* *ఈయన వేమగిరి సంస్థానానికి కొత్తగావచ్చిన దివాను. కాని నాటికలో ఎక్కడా తారసపడడు.*



# తెరచాటు

సమయం : సాయంకాలం.

[ టెంపరు పంతులూ రవణరావూ చల్లగాలికి షికారు వెళుతూవుంటూరు ]

రవణరావు:- అయితే, నీ మాటేం నీదంటావ్ ?

టెంపరు పంతులు:- అంతే బ్రదర్ ! ఒక మనిషినిగురించి... మనం...ఒకమాట అన్నామూ అంటే ... ఢిల్లీకెళ్ళినా తిరుగుండకూడదు. విన్నావా ! మన అంచనా...అంత నిఖార్సన్నమాట. అయినా, అబ్బబ్బా ! ఇంత ఘోష ఎన్నడూ యెరగను, రవణా ! ఎంత అనుభవంమీద చెప్పాడో గానీ, మహానుభావుడు:

“ఇరుగు పొరుగు పోరు ఋంతింత కాదయా,
విశ్వదాభిరామ వినురవేమ !”

ర:- మొత్తానికి...పేరుసార్థకంచేసుకుంటున్నావు. ఏది? ఆయన నొచ్చి, పట్టుమని పదిమాసాలయినా కాలేదు కదా, అప్పుడే ప్రచారం ప్రారంభించావే !

టెం. పం:- పదిమాసాలంటున్నావు, మెల్లిగా...నా పాలిటికి పదియుగా లనిపిస్తూంటేను...

ర:- చూడబోతే, నువ్విల్లా అహోరిస్తావాయిరి. వూళ్ళో వదంతు లెట్లావున్నాయో, తెలుసా ! “ఒహోహో ! ఆ టెంపరుపంతులుగారి అదృష్టమే అదృష్టం. దివాను గారి పొరుగునే చేరుకున్నాడూ...ఇంకేముంది, దివాణ

మంతా వారి చేతిలోనే వుంటుందీ..." అంటూ, ఒకటే మిటీ? నలుగురూ నాలుగు విధాలా...

వెం. పం:- ఆస్సి...మాయలోకం! వీళ్ళది నాలికా, తాటి పట్టా అంటాను. కొత్తగా యెవరో దివానుగారు దయ చేశారూ...యెస్టేటు ధుమాగా యేలేస్తున్నారూ...అని లోకులు చెప్పుకోవటమేగానీ ... ఆ నాయుడుగా రెట్లా వుంటారో, ఆయన మొహమైనా చూశానా, ఈ క్షణం వరకూ? చూడకుండానే ఆ వ్యక్తిమీద నాకు విరక్తి పుట్టేసింది...

ర:- అదుగో, మనిషిని చూడకండా మాటాష్టమే వచ్చింది, ముప్పు.

వెం. పం:- నాకు తిక్కెత్తించకు రవణా! అన్నమంతా పట్టి చూడాలా?

ర:- అవుస్లే. బలే నాడెంచేస్తావ్, అసాధ్యుడివి. ఈ శ్రీహరి నాయుడుగా రున్నారే, ఈయన...బళ్ళారినించి బదిలీ అయి వచ్చేస్తున్నప్పుడు...గ్రామం యావత్తూ రెయిలు స్టేషన్ దగ్గిర విరగబడ్డారట...ఆ ధర్మరాజుని వదులుకో లేం బాబూ అంటూ...వందలూ వేలూ మహాజర్లు వెళ్లాయట ప్రభుత్వంవారికి. అయితే, రూల్సు వప్పవుగానీ...ఆయ నకి ఈ జన్మలో ట్రాన్స్ఫరనేమాట వుండేదా?

వెం. పం:- చాలా ఘాటయిన మాటలు ప్రయోగిస్తున్నావు బ్రదర్! నాలుగురాళ్లు చేరగానే. మానవమాత్రుణ్ణి

ధర్మరాజుతో పోలుస్తావ్రా? ఇంకా ఆమాటకొస్తే, 'యమ ధర్మరాజు' అను! సరిగ్గా అతికిపోతుంది. డూడూబసవన్న లాగ అయిందానికీ కానిదానికీ బుర్రతిప్పే పాటకజనం మాట పట్టుకుని నువ్వూ వేళ్ళాడతావేమిటి, రవణా!

ర:– జ–న–వా–క్యం...

టెం. పం:– టట్! జనవాక్యంట...జనవాక్యం. పెద్ద వుద్యోగస్థులు చేసే భడవాపన్లు నీకేం తెలుసునోయ్? ఈ అధికార్లున్నారే, పిల్లు లోపాయికారీగా ఓ చిన్న పటాలాన్ని లేవదీసి...వాళ్ళ మంచితనాన్ని గురించి ప్రజలు నమ్మేట్టుగా ప్రోపగాండా చేయిస్తారు. పాలిటిక్సులో పండిపొయ్యామోయ్. హేఁ! మనదగ్గిరా, ఇవన్నీ చెప్పొస్తావ్?

ర:– వాళ్లు ప్రచారంచేస్తే ... దానికి విరుగుడు వేయటానికి నీ తరవాతనేగా?

టెం. పం:– సరిలెద్దూ. అగ్గిమీద గుగ్గిలం చల్లే బాపతు నీదంతాను. ఆనాయుడుగారు మాకు నూరామడదూరంలో వుంటే తీరిపోను. ఇట్లాటి పొరుగు దాపరించటం...అష్టాదశ మహాపాపాల్లోనూ...

ర:– వోరే, టెంపర్! అన్నాదమ్ముల్లాగ ఉండాల్సినవారు కదా, ఇరుగూ పొరుగులంటే. ఆయనపేరు చెబితేనే మండి పడతా వెందుకబ్బా!

టెం. పం:– చల్లటిపొద్దున హాయిగా షికారుకొచ్చి...యిప్పుడీ ఘోషెందుకు రవణా! మరోగొడవ యేదన్నా...

ర:- మరొకటా? మంచికో చెడ్డకో యెత్తనే యెత్తావు. ఈ గొడవ తేత్తేగాని ముందు కథ నడవదు. మరిచిపోయా వేమిటీ, 'ఆరంభింపరు నీచమానవులు...'

టెం. పం:-బాబూ, మహావాక్యాలు వల్లించకోయ్, నీకు పుణ్యముంటుందీ. ప్రాణం హైరాణ పడిపడి, కాస్తంత గాలి పీల్చుకుందామని బయల్దేరేసరికి...మధ్యని, ఈ తంపి ఒకటా...

ర:- తంపీ గింపీ అంటూ అనవసరంగా నోరు జారనివ్వకు, గోడలకు చెవు లుంటా యంటారు. అయినా, బ్రదర్! తెలియకడుగుతానూ? ఏ విషయంలో చెప్పూ, నీకూ వారికీ ఈ భేదాభిప్రాయం?

టెం. పం:- వక టేమిటీ? ఏ విషయంలోనూ మా ఉభయులకీ ఏకీభావం కుదరదు. అసలు మొట్టమొదటి పాయింటు, రాజకీయాల్లోనే చెరివక పార్టీగా అయిపోయినాం. ఇంకా మాకు పొత్తేఁవిటి రవణా!

ర:- నేను వినడం-ఆయన పార్టీకక్షలకు అతీతుడని. ఆ ప్రఖ్యాతిని బట్టేకదూ, మన ప్రభువువారు వీరిని ప్రత్యేకం పిలిపించింది...సరిలే. తరవాత?

టెం. పం:- ఏముందీ...నాచేత వూరికే పేలిస్తావు గాని...

ర:- అహఁ అలాక్కాదు. కడుపులోవుండే కుళ్ళు కాస్తా కళ్ళగక్కితివంటే...కొంచెం...భారం తగ్గుతుంది...

టెం. పం:- కుళ్లు అనేస్తావు బ్రదర్! ఇటువంటి దివాన్లనే

కాదు, ఇంతకంటె పెద్దపెద్ద వుద్యోగస్థుల్నీ...ప్రాజ్ఞతవచ్చి, బోలెడంతమందిని చూసుకుంటూ వస్తున్నా, కానీ ... అబ్బా! ఇంత టెక్కు...

ర:– అరె, ఇంతవరకూ ... మనిషినే చూడలేదంటివే, యిందాకా. ఆయన టెక్కూ వ్యవహారమూ దివ్యదృష్టివల్లనే కనిపెట్టాశావా యేం? ఉద్దండుడిలాగున్నావే!

టెం. పం:– అదికాదోయ్, మనిషన్న తరువాత ... కాస్తయినా కలుపుగోరుతనం ఉండాలా, వొద్దా? ఏమంటావు? 'నన్ను ముట్టుకోకు నామాలకాకి' అన్నట్టుగా... ఆ దేవిడిగుమ్మమే దిగిరాడాయె. ఒక ఆటలేదు, పాటలేదు. ...సంఘంలేదు. చివరికి క్లబ్బు మెంబరీ అయినా ... ఛీ! ఛో! యేం జన్మ!!

ర:– అద్దీ...అలా దారికి రావయ్యా! ఎవళ్ళమాటో ఎందుకుగానీ, నీ మట్టుకి నువ్వు...నాయుడుగారు ఎప్పుడయినా దయచెయ్యండీ అని చెప్పి పిలిచావూ?

టెం. పం:– హాఁ పి–ల–వా–లి...కాటికా బోట్టూ పెట్టి! మానవుడికి...యేమాత్రమయినా సరదావుంటే...తనంతట తనే చేరేవాడు. బ్రదర్! వొంటెరిగొట్టు రామలింగయ్యల్లోకి ఫష్టురకమంటే, నమ్మూ. మరో చిన్నసంగతి, నీతోగనక అంటున్నాను – వొంటెరిగొట్టేకాదు, ఆయన పిసినిగొట్టు కూడాను. కావాలంటే, ప్రత్యక్షంగా రుజువు చేయిస్తా.

ర:- ఏ-విఁ-టో, ... ఒకదాని కొకటి కథలన్నీ వరసపెట్టి అల్లేస్తున్నావు...

కెం. పం:- నయం. కథలనేవు గనక. పోనీ రవణా! పరమేశ్వరుడేదో యింత సిరిసంపదా యిచ్చాడా! ఇచ్చినందుకూ ... ఐశ్వర్యానికితగ్గ దర్జా యేదీ అంట? స్వల్ప విషయాల్లోకూడా అల్పగుణం బయల్పెట్టుకోవటం నేను అనేక సందర్భాల్లో...కళ్లారా చూశాను.

ర:- తన సొమ్ము తనయిష్టం... దానాలూ, ధర్మాలూ.

కెం. పం:- అదే, అదే, ఆమాటే ఆయన నిఘంటువులో లేదంటున్నా. ఇది నాకు బాగా తెలిసి చెబుతున్న విషయంసుమీ...ఇదంతా యెందుకూ? ఒక చిన్న సంగతి చెప్తా వింటావ్? పోయిన సోమవారంనాడే అనుకుంటా పాపం! ఓ బీదరైతు ఇల్లు తగలబడిపోయిందిలే, అందుకని, చందాల కాగితం పట్టుకుని ... నలుగురు పెద్దలదగ్గిరకీ తిరిగాడు. ఆ లీస్టులో అందరిపేర్లూ వున్నాయి...మన నాయుడుగారు మాత్రం 'ఆలోచిస్తా'మని చెప్పి పంపేసి పీడ వదుల్చుకున్నాట్ట! ఇదేకాదూ, పెద్ద వుద్యోగుల లక్షణం?

ర:- ఇంతకీ ఆలోచించారా?

కెం. పం:- నీకేం పిచ్చా యేం? తప్పించుకునే మార్గాలు వెయ్యైనొకటిలోనూ ఇది వకటీ. ఈ పెద్దవాళ్ళదగ్గిర, బ్రదర్! ఒక గొప్పశక్తి, కాదు, యుక్తి వుంటుందోయ్. పాము చావదూ, బడితె విరగదూ...'అవునూ—కాదూ'

అని తీగ్గా చెప్పేస్తే, అట్లాంటివాడు దద్దమ్మకిందే లెక్క. వూరిస్తూవుండాలి. పండు చేతికి చిక్కనివ్వకుండా వుండాలె. ...అందులోనే వుంది అందమంతాను. నువ్వేం చూశావు భాయ్! ఆఫీసర్ల తమాషాలూ! అవన్నీ...చదరంగపు యెత్తులు!!

ర:- అట్లానా, చెప్పావుగావూ! ఊళ్ళో యేం జరిగేదీ ముందు, నీ గెజెట్‌లో పడితేగాని పేపర్ల కెళ్ళదుగా?

ఎం. పం:- దానికేం గాని రవణా! గ్రామంలో పసిపిల్లలకి పాలూ, పునిస్త్రీపడుచులికి పువ్వులూ రోజువారీ సప్లయి చేస్తూండేవారు పూర్వపుదివాన్లు, గురుతుందా? ఇప్పుడవి బర్తరఫు కావటం యేమన్నా గమనించావూ?...ఎట్లా వెలుగుతూందో చూశావా, మన నాయుడుగారి హయాం! సింగరాజు లింగరాజుని చంపి పుట్టాడోయి నాయనా, ఈ మహానుభావుడు...

ర:- ఇవన్నీ...వారి సొంతసొమ్ముతో చేసేపన్లు కాబట్టి, అవి మానుకుంటే అంతగా...తప్పుపట్టాల్సిన సబుబు కనిపించదు.

ఎం.పం:- అహాఁ- కాదులే. వారి యిష్టానికి ఎవడూ యెదు రెళ్ళలేడన్న విషయం నాకూ తెలుసు. కాని, మనలో మనమాట! కలివిడిగా ఉండాల్సిన తీరు ఇదేనా అని అడుగుతా. అయినా, వొకటుంది రవణా! ఆయనగారికి నేనేం చేదుపోశానో యేమో...ఆ పరమేశ్వరుడికే తెలియాలి...ఇంతటి పెద్దమనిషిన్నీ అకారణంగా...నాపయిన పగబట్టినట్టు మసులుకుంటాడోయ్!

ర:- అరె, నీమీాదా! నీమీాదా పగ? మేకలాంటివాడివి. నీమీాదనా ఆయనకి పగ!!! చిత్రంగానే వుందే? ఆయన కూడా...అనవసరంగా ద్వేషాలు పెంచుకొనేవాడు కాడే?

కెం. పం:- ఒకాటి కాదు బ్రదర్! తొంభై దృష్టాంతరాలు చూపిస్తాను; ఈ మధ్యనే నాయుడుగారు...ఒక గుఱ్ఱాన్ని అమ్మజూపారు. ఆ రంగు గుఱ్ఱాన్ని కొందామని చెప్పి ఎన్నాళ్ళనించో అనుకుంటున్నా. సరే, ఆడబోయిన తీర్థం ఎదురొచ్చిందీ, గుమ్మం కదలక్కర్లేకుండానే అమిరేటట్టుంది కదా అని సరదాపడి ఒకళ్ళిచ్చే ధర నేనే యిస్తానూ, పైకి మాత్రం పోనియ్యొద్దని కబురుచేశాను. విన్నావా, రవణా! ఆ మనిషి గుణం యేమిటనుకోను? మాటమాత్రమయినా నాకు తెలియనివ్వకుండా...గుప్‌చప్‌గా గుఱ్ఱాన్ని దూరపు సంతకి తోలిపెట్టించేశాట్ట. నా కాసంగతి నిన్నగాక మొన్ననే తెలిసింది.

ర:- నాయుడుగారే, ఇట్లాటి పని చేసింది?

కెం.పం:- ఇంకా మెల్లిగా అంటావ్! ఆ సంగతల్లా వుండనీ. పువ్వుల మొక్కలంటే మీా వదినె చెవి కోసుకుంటుంది, తెలుసుగా? ఒకనాడు ఏదో పనిమీాద మేఁవిద్దరం కలిసి ...వారి తోటపక్కనించే వెళ్ళాలిసొచ్చింది. అప్పట్లో చిత్రమయిన కొత్తరక మొకటి కంటపడిం దట. దాని వేరయినా, అంటైనా దొరికితే బాగుండునూ అని పది మాట్లు ఆవిడ పలవరించిపోయింది. ఈ సంగతి, మా తోట

మాలి వెళ్ళి, నాయుడుగారి సింహాచలంతో వూదాడట. ఈ నవుకిరీవాళ్లు తిన్నగా వుంటారూ? వాడెళ్ళి... మెల్లిగా నాయుడుగారి చెవిని పడేశాడు. నాకుందే, రవణా! ఒకణ్ని అడగడమనేది కిట్టనే కిట్టదు. అయేసరికి...మన నాయుడు గారు మాట దక్కించుకోలేకపోవటం సరికదా, మా తోట మాలి మొహం యెదట "ఆ మొక్క యెవళ్ళనీ ముట్టు కోనియ్యకుసుమీ..." అని అనేశాట్ట, విసిరికొట్టినట్టుగా. చెయి విదపకుంటే మానె, మాటసరళి అయినా లేదే మయ్యా, మనిషికీ! ఇలాటివాణ్ని వెనకేసుకు వచ్చి యేమో చెప్పబోతావ్, శ్రీరంగనీతులు...

ర:- నేనేం వారికి యేజంటుని కానబ్బాయ్, వెనకేసుకు రానటానికి. నలుగురూ అనుకునే మాటలే నే చెప్పేది. అ-యి-తే...నేను విన్నదానికీ నువ్వంటున్నదానికీ ఇంత తఫావతుగా వున్నదేమా అని ఆలోచిస్తున్నా.

కెం. పం:- నీకు రెండో ఆలోచనక్కరలేదు రవణా! నానా అవలక్షణాలూ పట్టితేగాని, ఎవడూ పెద్దమనుషుల జాబితాలో ఎక్కడు. ఒక్కటే లెఖ్ఖ. పెద్దమనిషీ అంటే పుండాఖోర్ అని అర్థంరాసుకో. ఎప్పుడయినాసరే, మనిషిని వాడి వడపోసి, ఎంతో అనుభవంమీదగాని ఒకణ్ని గురించి చెప్పమనుకో.

ర:- ఆఁ! నాకు తెలీదూ?

కెం. పం:- గొప్పయింటి తప్పిదాలు బయలుపెట్టడం యెందు

కనిగానీ, ఇదుగో, మన నాయుడుగారినిగురించి లోగుట్టు వెల్లడిచేయాలంటే లక్షలూ కోట్లూ వున్నాయి.

ర:- అనుకోవటమేగాని...లోపాలులేని మానవుడుంటాడా? లోపాలులేకుంటే వాడు మనిషే కాడూ...

లిం. పం:- పోనీ గానీ... మొన్నమొన్ననే జరిగిన చిత్ర మొకటి చెబుతా, వింటావ్?

ర:- చెప్పవయ్యా, నాయనా...

లిం. పం:- మా యింట్లో పనిచేసే నాగన్న ఎరుగుదువుగా, ఆ యెర్రటి కుర్రాడు...వాడు కొంచెం అధిక ప్రసంగం చేసేటప్పటికి...పోరా వాజా నీకిష్టంలేకుంటే నిలిచిపో... అని చెప్పి కేకలేసి కూకలేశాను. కుర్రసన్యాసి గోచీపెట్ట నేర్చినప్పటినించీ మన కమతంలో వుంటున్నాడు...బుద్ధి వచ్చి, కాళ్ళమీదపడితే, మళ్ళీ వాడిపని వాడికిద్దాం కదా అని అనుకునే యింతలో, ఇంకేముంది? మన నాయుడు గారు...చీలిక వచ్చిందే చాలునని చెప్పి, మారుమాట లేకుండా వాడ్ని టపీమని పనిలో పెట్టేసుకున్నారు. ఒక టేమిటి బ్రదర్! ఉత్తనే నాకు నెత్తుకుడుకెత్తుతూం దను కున్నావా? ఉండవలసిన లక్షణాలన్నీ వున్నాయి, మన సకలగుణాభిరాముడికి. అందుకనే బాబూ, ఈ గొడవ అసలు ఎత్తవద్దోయ్ అన్నాను. ఆ మహానుభావుడు ఎంత చప్పున మా పొరుగునించి విరగడైపోతాడా అని ముక్కోటి దేవతలకీ మొక్కుతున్నామంటే నమ్ము, రవణా!

ర:- ని-జం-గా...నువ్వు చెప్పే సందర్భాలు పట్టిచూస్తే, మతి పోతూంది. ఇట్లాటిపొరుగుతో వేగటం...చాలా చికాకే. నలుగురూ అనుకుంటూవుంటే యేమో, నీ అదృష్టం బాగానేవుంది కాబోలు అనుకున్నా. నేనూ...చూడు, నీకోసమేలాగుంది...ఎవరో...

[ జోగులు ప్రవేశం ]

వెం.పం:- అదుగో, జోగులూ! ఇతడే బ్రదర్, నేన్చెప్పలే, కొంప నిలబెట్టుకోవటానికని ... నలుగురుపెద్దల్ని చూడ వచ్చాడని? సరే...ఎంతవరకొచ్చింది జోగులూ, నీ వ్యవహారం? మళ్ళాయేమన్నా వసూలయినట్టా?

జో:- చిత్తం బాబయ్యా! మీ దర్మమా అని, శానావరకు పూటయిందండి. మంచిది సూపిచ్చి యింక పని పారంభం సెయ్యాలండి.

వెం. పం:- భేషూ! ఎక్కడో నక్కతోక తొక్కినట్టున్నావే, వాలకం చూస్తే? కిందటి దఫా జాబితా పట్టుకొచ్చేసరికి ...కాయితంమీదేగానీ చేతిలోయేమీ పడలేదంటివే?

జో:- అవునండి బాబయ్యా, యెనక తమ దర్శనానికి వచ్చినప్పుడూ...మన దివాణంవా రేమిచ్చినార్రా అని అడిగిను గదండి, తమరు!

వెం. పం:- ఆఁ...అవునవును...

జో:- పెబువోరు ఆలోచిస్తామన్నారనికూడా మనవి శేసాను గదండీ!

వెం. పం:- అవును...ఇంకా ఆలోచిస్తూనే వున్నారా?...

జో:- ఆ మర్నాడు బాబయ్యా! దివాణంవోరు సాయంగా మా వూరు దయచేసి, నాగ్గలిగిన నట్టం యేపాటో యేంటో ...అంతా దరాప్తు చేసినారటండి. నాకీ బోగట్టా ఇప్పుడే తెలిసొచ్చింది. మరిగొచ్చీ...మొన్నటిరోజున...యేల్నోరి దరిచనం మళ్ళీ సేసుగున్నానండి, అయేసరికండీ 'జోగులూ! నువ్వు చాలా నష్టపడ్డావుట, పాపం! నాకు తెలిసింది. ఈ చండాలకోసమని చెప్పి, వూళ్ళో తిరుగుతూ కూ చోకు, వచ్చేది వానాకాలం. గభాల్న కొంప లేవదియ్యి' ... అని చెబుతూ, యెంటనే జేబీలోంచి తీసి ... ధర్మరాజు యాభై రూపాయల లోటు చేతికిచ్చినారండి, బాబయ్యా.

వెం. పం:- ఏమిటీ? యాభై రూపాయలే?

జో:- అవునండి బాబయ్యా! లెక్క- యాబయ్యండి. ఆ మారాజు దరమ్మా అని ఇల్లు నిలబడిందండి. ఆరి పేరు చెప్పుకోని...నేనూ బిడ్డలూ హాయిగా బతుకుతామండి కలప తీసుకొద్దామని సంతకి బయల్దేరానండి.

వెం. పం:- బలే బహుమతి కొట్టావే! అదృష్టవంతుడివి... చాలా సంతోషంగావుంది, జోగులూ!

జో:- ఏదో, బాబు లందరి చేతిసలవానూ...దండాలండి...

[ జోగులు వెళ్ళిపోతాడు ]

ర:- ఇదేమిటిది బ్రదర్! 'పిసినిగొట్టూ' అని తేలిగ్గా టైటిలు పారేశావే. మనిషినయినా చూడకుండా?

శెం. పం:- కాదుగానీ...గుణం వెల్లడయ్యేవరకూ...ఇల్లా గుప్తదానాలు చేసేవారివిషయంలో ... పొరపాటుగానే ఆలోచించవలసివస్తుంది, మరి. ఏమిటో అనుకున్నా గానీ ... యాభైరూపాయలిచ్చి పంపాట్ట, రవణా! ఒఖ్ఖ మాటుగా...యాభైరూపాయలు!! చెప్పుకోతగ్గ ఔదార్యమే...అయితే, ఇటువంటి మహాదానాలుచేసే పెద్దమనిషికి...చిన్నవిషయాల్లో మాట తక్కించుకునే సరసత లేదేమో అని చూస్తున్నా.

ర:- ఇహ నిన్ను నమ్మను, బ్రదర్! నీవన్నీ దొంగమాటలే ...నువు కట్టేవన్నీ గాలిమేడలే!!

శెం. పం:- ఉండు రవణా! నాయుడుగారి తోటమాలీ ఇటు వేంచేస్తున్నా డెందుకో గానీ...

[ సింహాచలం ప్రవేశం ]

శెం. పం:- అదేమిటోయ్ సింహాచలం! చాలా పెద్ద బరువెత్తుకొస్తున్నా వే?

సింహాచలం:- మనింటికేనండి సామీ! దొరగో రంపిస్రను.

శెం. పం:- ఏమిటబ్బా, అంత భారమయిన బహుమానం!

సిం:- ఇది 'పాజహా'నండి. కొత్తరకం పువ్వులమొక్క. దొరగోరు మైసూరెళ్ళినప్పుడు మా రాజావోరి పూలవనంలో తీయించి తెచ్చినారండి. అమ్మగారేమో ఇది చూశి సరదాపడ్డారని అన్నాడండి మాతోటమాలి. నేను దొర

గారితో చెప్పేసరికి "ఎవళ్ళనీ తాకనివ్వకు, జాగ్రత్తగా పెంచాల్సుమీ" అన్నారండి.

సెం. పం:- ఒహో...అయితే ఈ రకం ఇంకా యేపాటు న్నాయి, మీ తోటలో?

సిం:- అబ్బె, ఎక్కోనా! ఇదొకటే వొక్కటి గదండీ...అందు కనే, అంత అపురూపంగా చూడమన్నరు. ఒక్కటయినా సరే, కావాలీ అంటేమటుకు లేదన్నమాట లేదండి మా దొరగోరి దగ్గర.

సెం. పం:- చాలా సంతోషించానని చెప్పు, దొరగారితో. ఇదుగో ఇది తీసుకుని, కుర్రవాళ్ళ కేఁవన్నా, కొనుక్కో.

[ సింహాచలం వెళ్ళిపోతాడు. ]

ర:- ఏం బ్రదర్! దీనికేమి టంటావ్?

సెం. పం:- కృతజ్ఞణ్ణే.

ర:- పనికిరాదు. ముందు క్షమాపణ, తరవాత కృతజ్ఞత. తెలిసిందా క్రమం? బులబులాగ్గా వదిలేస్తాననుకున్నావా నిన్ను?

సెం. పం:- ఆయన్ని గురించి ఏం నిశ్చయించటానికీ వీల్లే కండా వస్తూందోయ్.

ర:- ఎందుకు వీల్లేదోయ్! నాయుడుగారు ఉత్తమోత్తముడు; ఉదారశీలుడు. ఆయనవంటి మనిషిని చూడబోము. వారిని గురించిన నీ వూహాలన్నీ కేవలం అపోహాలు, శుద్ధహార

పాట్లు. సరేనా, ఇంతకంటే నిశ్చయించాల్సిందేముందీ? ఫెడరల్ కోర్టుకి వెళ్ళినా...ఇదే తీర్పు...

వెం. పం:- వుండుండు...ఇవా ళేమిటో కానీ, నేను తలుచుకున్న వాళ్ళందరూ యిక్కడనే తారసపడుతున్నారే! అదిగో ఆ గుర్రాల్ని వెంటబెట్టుకొస్తున్నాడు చూశా? వాడే నాయుడుగారి అశ్వదళాధిపతి. మనం బేరంచేసిన గుర్రంసంగతి యేమయిందో కనుక్కోవాలి.

ర:- కనుక్కునే దేమిటి! కానీ, మరో టోకరా తిందుగాని...

[ గోపన్న ప్రవేశం ]

వెం. పం:- ఏం గోపీ! నాయుడుగారి 'పంచకల్యాణీ' అమ్ముడయిందా?

గోపన్న:- యేటి బాబూ! నాకేం సంతోసం లేదు.

వెం. పం:- అహాఁ కాదులే. మనమిస్తామన్నకంటే...యేపాటి ఎక్కువొచ్చిందీ అని.

గో:- మీాంబోటినోరు సవ్వారి చెయ్యటానికి పనికిరాదండి బాబూ! ఈ సంగతి అయ్యగోరికి తెలిసే, తఁవరు కావాలని కబురెట్టినా ఒల్లకున్నరఁడి. అబ్బ! శెబితే నమ్ముతారో లేదో బాబయ్యా! ఇంత పెంకి జంతువుని ... యేఖ్కడా సూళ్ళేదండి. మోటాముండావోణ్ణి, నేనే దాని తాపులికి తాళలేక రెండుసార్లు సచ్చి బతికానండి.

వెం. పం:- ఆ రంగూ అదీ చూస్తే, గోపీ! లక్షణంగా అగపడేసరికి...

గో:- నిజఁవేనండి. చూపుకి షోగ్గానే వుంటదండి. కాని, తగని తొందర. దానికి యేక్షణాన తిక్క-తిరుగుతదో చెప్పలేము. రెచ్చిందంటేమటుకి పట్టపగ్గా లుండవండి. అందుకోసనే ఎంతకయినా సరే, ముందు దాన్ని విడుదలచేసుకొచ్చి, తరవాత మరో పని సూడమన్నరండి. దానిమీదని యెంత మక్కు-వ పడ్డారో అయ్యగోరు, అంతా యేడిపించుకు తిన్నదండి.

వెం. పం:- అయితే, గోపీ! ఇంచేతనేనంటావా, మీ అయ్య గారు...నాకివ్వకపోవటం?

గో:- ఎంత మాటండి. పంతులుగోరూ! యెదార్దంగా అంతే నండి. డబ్బుమొకం చూపే రక మనుకున్నారా యేం, మా అయ్యగోరంటే? తమకు కబురుసేసినందుకు, నిఁజంగా ...కల్యాణి మంచిదే అయితే 'తచ్చణం తీసుకెళ్ళి దీన్ని వెంపరుపంతులుగారి సాలలో కట్టేసిరారా గోపీ' అని హోడ్డరేసెయఁరటండీ? అ-స-లు...తమరు సొమ్మిస్తేమాత్రం ఆరు పుచ్చుకోవద్దూ!

వెం. పం:- అహఁ, నాకు తెలీదట్రాగోబీ! సరిలే, వెళ్ళిరా, పాపం, దూరంనించి వస్తున్నట్టుంది.

గో:- సెలవిప్పించండి.

[ వెళ్ళిపోతాడు ]

రవణ:-బ్రదర్! మంచిచెడ్డలు తెలియకండా మాట లనెయ్య డంలోనే అనుకున్నా...ప్రశ్నలు వేయటంలోకూడా... నాయుడుగారి గుర్రానికున్నంత తొందరా వుందే నీకూ!

ఔం. పం:- పొరపాటే... పొరపాటన్నానుగా !

ర:- నువ్వీ తొందరపాటు కాస్త తగ్గిస్తేతప్ప...నిన్నుగూడా... దూరపుసంతకి తోలిపెట్టాల్సి వచ్చేలాగుంది.

ఔం. పం:- ఏం చేసినా చెయ్యగలవ్, ప్రబుద్ధుడివి. కాని, రవణా ! నాయుడుగారినిగురించి...నా వెనకటి అభిప్రాయాలు యావత్తూ...ఇవాల్టితో మార్చుకోక తప్పదనిపిస్తూంది...కానీ...

ర:- యేమిటింకా, కానీ యేగాణిన్నీ ?

ఔం. పం:- కాదుబ్రదర్ ! అన్నీ బాగానే వున్నాయి. అటువంటి పెద్దమనిషి...మా నాగణ్ని కొలువులోకి ఎట్లా చేరనిచ్చి వుంటాడా అని...

ర:- ఇన్ని నిదర్శనాలు చూచావబ్బీ ! ఇంకా...నాయుడుగారివల్ల నకిలీపని వుంటుందనే, నీ ఆలోచన !

ఔం. పం:- అదుగో, పెద్దమ్మ. మాటలోనే వస్తున్నాడు. యెస్టేటు దుస్తులు వేయకుండా, నే నిచ్చినవాటితోటే గడుపుతున్నాడే !

[ నాగన్న ప్రవేశం ]

నాగన్న:- దండఁవండి బాబయ్య !

ఔం. పం:- ఏఁవిరోయి నాగన్నా ! దారితప్పి వచ్చినట్టుందే ?

నా:- క్షమించాలండి బాబయ్య. నా పన్లోకి నే నెల్లిపోయి చేసుకుంటానండి...

వెం. పం:- ఏం, అప్పుడే దయచెయ్యమన్నారేమిటి, నాయుడు గారు ?

నా:- నే నెక్కడా ప్రవేశించలేదండి. వుపకారం జరుగుత దేమోనని ఆశించిన మాట నిజంవండి. అదేవొచ్చింది నావల్ల బుద్ధితక్కువ. క్షమించాలి బాబయ్యా ! తమరు తండ్రులు...

వెం. పం:- కాదు లే. యస్టేటులో ఏదో పెద్దపనిలో వున్నావని విన్నాను...నాగా ! నువు నాలుగురాళ్లు తెచ్చుకుని బాగుపడుతున్నావంటే, నాకుమాత్రం సంతోషంకాదట్రా!

నా:- అంతమాట వొద్దండి బాబయ్యా ! నే నెల్లి ... ఆరిని ఆశ్రయించటం వచ్చిందండి ముప్పు...కోపం శెయకండి బాబయ్యా !

వెం. పం:- అబ్బే, నాకేం కోపంరా, పిచ్చాడా! నన్నొచ్చి చెప్పమంటేకూడా చెబుతా. అదా అనుకుంటున్నావ్ ! అసలింతకీ, యేమన్నారేంవిటీ ?

నా:- అనటాని కేముందండి ? అక్కడికెళ్ళి చివాట్లే కాశినానండి. లేచిన యేలాయిసేసం...

వెం. పం:- చెప్పరా, చప్పునీ.

నా:- తమరు కోపం జేసినాకండీ... రేత్తిరికి రేతిరె పోయి, నాయుడోరి కాళ్ళమీదడ్డానండి. నేను చెప్పుకున్నదంతా ఇనీ, 'సరే రేపుదయం రా' అన్నారండి. అలాగే వెళ్ళేసరికి, పక్కకి పిలిచీ, "వోరి నిర్భాగ్యుడా ! తగినంత

కారణంలేందీ వారుమాత్రం పొమ్మంటూరా? మీపంతులు చాలా మంచివాడు; నాకు తెలుసు. ఒకవేళ ఏదన్నా చికాకులోవుండి ఓ మాట అన్నారే అనుకో. ఆ పాటి దానికే తొందరపడుతావుట్రా వాజమ్మా! పో, పో ఈపాటికి వారి కోపం తగ్గిపోయుంటుంది; తీరి కూచుని నోటిముందటికూడు పడగొట్టుకోకు..." అంటూ, వొక ఘంటసేపు నాకు నచ్చజెప్పినారండి.

వెం. పం:- ఇవన్నీ నిజంగా...ఆయన చెప్పిన మాటలేనుట్రా?

నా:- అయ్యో బాబయ్య! పెమాణపూర్తిగానండి...ఆరు... యింత నూరిపోశినా, నాకుమాత్రం...చెప్పొద్దూ, మమకారం వొదిలింది కాదండి. మర్నాడు రేత్తిరి మళ్ళాయెల్లినానండి. "వొరే, నాగా! నువు వృద్ధిలోకి రావాల్సిన కుర్రాడివి. ఉన్న చోటనే నిలదొక్కునుండు. 'ఇనుం విరిగినా అతుక్కుంటుందిగాని, మనసు విరిగిందంటే అతకదుసుమీ' వెళ్లు వెళ్లు, ఒక్కక్షణమయినా ఆలస్యం చెయ్యకు" అని చెప్పి...మరి నిలవనియ్యలేదండి.

వెం. పం:- సరే. నువ్వింటికెళ్ళి, మామూలుగా పనిచూసుకో. తరవాత వచ్చి మాటాడతాలే.

[ నాగన్న వెళ్ళిపోతాడు. ]

ర:- ఏం, బ్రదర్! చెప్పినంతా అయిందా?

వెం.పం. పొరపాటే రమణా! పొరపాటే. నీతో నేను, పూసగుచ్చినట్టు యెన్ని చెప్పానో, అన్నిటికన్నీ...పెడీమంటూ

లెంపకాయలు కొట్టినట్టుగా ... జవాబు లొచ్చేశాయి. నాకు మనస్సులో యిప్పుడు కలుగుతున్న మార్పున్న దే... అది యిట్లాటిదీ అని నోటిమాటలతో చెప్పలేను.

ర:- మార్పు కలగడంలో లేదు గొప్ప. కలిగిన మార్పు నిలవాలి...

కెం. పం:- ఎందుకు నిలవదు లే! నిజానికి బ్రదర్! ఇవాళ నువ్వీవిషయం కదపటం...ఎంతో మేలిచ్చింది. అయితే, నోరు పారేసుకుని, మాటలు మిగలజెప్పినందుకు...నువ్వు గనక సరిపోయిందిగానీ...పై వాళ్ళయితే ఎంత ప్రమాదం!

ర:- ఆఁ! ప్రమాదాని కేముందిగానీ...తగుమాత్రం దవడ శుద్ధి...అంతకు మించితే దేహశుద్ధి జరగబోతుంది. అంతేనా? బ్రదర్! అయిం చేదో అయిందీ...ఇకముందయినా పరమశత్రువుకూ్కడా...అనవసరంగా పేర్లెట్టననీ, బిరుదు లివ్వననీ వొట్టేసుకో.

కెం. పం:- వొట్టేసరి రవణా! ఇప్పటికి చేసిన పొరపాటే చాలు. కాని, వొక్కటుంది బ్రదర్! నాయుడుగారిలాగ గూఢంగావుండే మనుష్యులతో...మా చెడ్డ తంటావోయ్.

ర:- ఏ తంటా వుండదూ, నోరు మంచిదయితే.

కెం. పం:- అదికాదు...వారిలోవుండే మంచితనం చటుక్కుని బయటపడదు. తరవాత తరవాత ఒక్కొక్క లక్షణమే వెల్లడికావటం, లోకం మెచ్చుకోవటం...జరుగుతుందనుకో.

ఇప్పుడు చూశావా? దూరాన్న వుంటూనే, మన. నాయుడుగారికి నేను గౌరవం చూపవలసి వస్తూంది.

ర:- అదేం కర్మం!

శెం. పం:- ఎంచేతనంటావా? నలుగురితోటీ నేను ఎంత సోషల్‌గానూ, ప్లెయిన్‌గానూ వుంటూవుంటానో నీకు తెలిసిందేకదా!...

ర:- అవును...ఆయనకూడా అటువంటివాడే నేమో?

శెం. పం:- అట్లా అయితే, ఇంత కాలమా? ఈపాటికే నేస్తం కలిసిపోయేది.

ర:- ఒక్కటే చెబుతున్నాను, నమ్ము బ్రదర్! ఇన్నాళ్ళ నించీ మిమ్మల్ని ఎడంగా వుంచింది నీ స్వభావంలో లోపం కాదు. ఆయనని అర్థంచేసుకోలేని నీ అపోహ. అదే ఇంత వరకూ మీ మధ్యని తెరచాటుగా.. పరిణమించింది. అవునా?

శెం. పం:- అంతే బ్రదర్! అంతే. సరీగ్గా కనిపెట్టావు. నావన్నీ అపోహాలే, నువు చెప్పినట్టు. నా తొందరపాటుకి తగిన పరాభవం జరిగిందీవేళ...ఓహో! ఈయనా యిప్పుడే వస్తున్నాడే, పాపం! రవణా! ఆ వచ్చే పెద్దమనిషిని కాస్తంత గమనించూ...

ర:- ఎవరేమిటీ?

శెం. పం:- ఈ పార్టీకక్షలున్నాయే, బ్రదర్? వీటమ్మకడుపు బంగారంగానూ...వ్యక్తుల్నే కాకుండా సంఘాన్నే నాశనం

చేసి పారేస్తున్నారోయ్, నాయనా! ... ఎంతటి పెద్ద వాడయినా ఈ విషయంలో గడ్డితినక తప్పటం...

ర:- అరె! ఆయనెవరూ అంటే...ఈ గొడవంతా యాకరు పెడతావే? రింగు తిరిగిందా యేం?

రెం. పం:- అదేనయ్యా చెబుతూంట: దేవానందం అనిచెప్పి ...వొక చిన్న యిస్కూలు మేష్టరు. బహుకుటుంబీకుడు. ఈ దగ్గిరే ఓ కుగ్రామంలో ... ఏదోపాపం, కాలక్షేపం చేస్తున్నాడు. అయితే, మొన్నటి 'యలక్షన్'లో మన తరఫున పనిచేశాడులే. ఆ కక్ష కడుపులో పెట్టుకుని... అవతల పార్టీవాళ్ళు...పిల్లలు బళ్ళోకి వెళ్ళకుండా కట్టు కట్టించారు. ఈయనా, నాలాగే కొంచెం మాటదురుసు కాని, మంచి నమ్మకస్తుడు...వీలయితే ఏదైనా సాయం చేదామని...

[ దేవానందం ప్రవేశం ]

రెం.పం:-ఏఁవండి మేష్టారూ! ఎల్లావున్నాయి, మనపాలిటికు్స?

దేవానందం:- నమస్కారమండి! ఇప్పుడే పిల్లలు ఒక్కొక్క ళ్లుగా పోగడుతున్నారండి. మళ్ళీ మామూలుదారిలో పడ టానికి వారంపదిరోజులన్నా అవుతుందండి.

రెం. పం:- బాగానేవుంది...

దే:- మా స్వంతవూళ్ళోనే ఒక ఖాళీ వచ్చిందండి, పంతులు గారూ! బహుశా, నా ఒక్కడికి బదలాయింపు...

టెం. పం:- ట్రాన్స్‌ఫర్లన్నీ 'ఆ పార్టీ' వారి చేతిలో పని కాబోలునే?

దే:- అయినా ఫరవాలేదండి. మన దివానుగారు సిఫారసు వుత్తర మిచ్చారండి.

టెం. పం:- యేమిటీ, నాయుడుగారు త్తర మిచ్చారా!!

దే:- అవునండి. ఈ మాట విన్నప్పటినుంచీ...మన పార్టీవా రందరికీ ఆశ్చర్యంగానే వున్నదండి. నామట్టుకి నేను... కల్లోకూడా అనుకోలేదండి, ఇల్లా జరుగుతుందని.

టెం. పం:- చిత్రంగా వుందే!

దే:- చిత్రమేనండి...వారంతటవారే, నాకు కబురంపి, పిలి పించారండి. ఇదేమిట్రా భగవంతుడా, దివానుగారేమిటి- నన్ను పిలిపించడ మేఁవిటీ...ఏదో అభాండం నెత్తిమీద పడేటట్టుందే అని హడలుకుంటూ వెళ్ళానండి. వారి పక్కనే కుర్చీమీద కూర్చోమన్నారండి. పార్టీకక్షల్ని గురించి పక్కా ఘంటన్నరసేపు ముచ్చటించారండి. మహానుభావుడిది అమృత వాక్కు! ప్రాణం లేచివచ్చిం దంటే నమ్మండి, పంతులుగారూ!

టెం. పం:- తియ్యటి కబుర్లు లేకపోతే, యలక్షనుకి పనికొస్తాడ టయ్యా ఎవడన్నానూ!

ర:- నేను చెప్పానుగానుటోయి పక్షీ! నీలో మార్పు నిలవ దనీ. ఆయన్ని సాంతంగా మాటాడనియ్యవేం పాపం?

వెం. పం:- అబ్బె లేదు; పొరపాటు. ఆఁ, ... చెప్పండి మేష్టారూ...

దే:- "రాజకీయాల్లో అభిప్రాయ భేదాలు ఎన్నయినా వుంటే వుండొచ్చు. వాటితో లంకెపెట్టి ... అమాయకులైన వ్యక్తులికి చెరుపు చెయ్యటం మహాఘోర" మన్నారండి. మరి ప్రస్తుతం నేనుంటున్న గ్రామం నాకస్టే అనుకూలంగా లేదని తెలిసిందండి, వారికి. మంచిస్థలం చూచుకొని చెబితే, అక్కడికి మార్చేయత్నం ఆలోచిస్తామన్నారండి. అదృష్టం పండిందిరా అనుకుని ... మా వూళ్ళో వచ్చిన ఖాళీనిగురించి మనవిచేసుకున్నానండి. వేంఠనే ట్రస్టీలు ముగ్గురికీ మూడుత్తరాలు స్వయంగా రాసిచ్చారండి. నాయుడుగారి వుత్తరమంటే...ఏ పార్టీవారయినా కళ్ళనద్దుకొని, శిరసావహిస్తారండి...

వెం. పం:- బలే అదృష్టవంతుడివయ్యా!...

దే:- నిజమేనండి. ఇట్లాటి అదృష్టం నా జన్మలో తలవనైనా లేదండి...ఉత్తరాలు చేతపుచ్చుకుని, సెలవుతీసుకుంటానన బోయానండి. భోజనానికి వుండి పొమ్మన్నారండి. అబ్బ! ఆ సత్కారం...పంతులుగారూ! వర్ణించలేనండి... ఇస్కూలు మేష్టర్లమీద ఇంతా అంతా కనికరం గాదండీ, వారికి...

వెం. పం:- అంత కలివిడిగా మాటాడారటండీ?

దే:- కలివిడేఁవిటండి ?...పిల్లాడెల్లి పలకరిస్తే పలుకుతారండి, మారాజు. నిగర్వచూడామణి. ఒహో ! ఆ మనసేమిటండి...వెన్నపూస!! ఎంతసేపూ, ఈ పార్టీకక్షల్ని గురించే ఆయనకి పట్టుకున్న విచారమండి. తుచ్ఛమయిన ఈ భేదాలు...స్నేహపాత్రులయినవారినే విడదీసేస్తున్నాయని అంటూ, చాలా నొచ్చుకున్నారండి. ఇంతలో, తమ ప్రసక్తి వచ్చిందండి ! "ఆయన మంచి యోగ్యులని విన్నాను. కాని, వారి పరిచయభాగ్యం నాకింకా కలగలేదు. అట్లాంటి తరుణం ఎంత త్వరలో లభిస్తుందా అని చూస్తున్నాను" అని సెలవిచ్చారండి.

వెం. పం:- మేష్టారూ ! ఆదివారంనా డొకసారి కనిపించగలరూ ?

దే:- తప్పక దర్శనం చేసుకుంటానండి. సెలవు !

[ వెళ్ళిపోతాడు ]

వెం. పం:- రవణా ! పో యొద్దాం, లే.

ర:- ఎక్కడి కేఁవి టిప్పుడు ?

వెం. పం:- పెద్దప్రశ్నే వేశావు...నిజంగా. నే నెంత పొరపాటు చేశాను, బ్రదర్ ! ప్చ్, ప్చ్ !! మన నాయుడుగారి దర్శనం చెయ్యకుండా, ఇంకొక్క నిమిషమయినా నిలవలేను. లే—పద...

ర:- అల్లాగే వెళ్దాంలే. నాకూ సంతోషమే. అయితే,

మనల్ని గురించి 'మీరు ఫలానా' అని చెప్పి ఎవరయినా తెలిసినవారు ప్రవేశపెట్టడమా, లేక మనంతట మనమే ప్రవర చెప్పేసుకుని...

ఒం. పం:- బ్రదర్! మన నాయుడుగారి దర్శనానికి వెళుతూంటే ... మధ్యని మరొకరు వచ్చి మనల్ని ప్రవేశ పెట్టడ మొకటా! మహా గొప్ప లాంఛనాలు నేర్చి పోయ్యావులే...

ర:- 'లేడికి లేచిందే ప్రయాణ' మన్నట్టూ నీతో యే మొచ్చినా యింతేగదా! ఊఁ పద.

సమాప్తం.

# విశ్వసాహిత్యమాల — రాజమండ్రి

( స్థాపితం : 1935 )

సంపాదకులు :— మహీధర జగన్మోహన్‌రావు

| | | | |
|---|---|---|---|
| మానవులు : మహీధరములు — ఎమ్. ఇలిన్ | రు. | 5 | 0 |
| జనులు : మహాజనులు — ఇలిన్ & సెగాల్ | | 5 | 0 |
| జ్ఞానం — విజ్ఞానం — ఇలిన్ & సెగాల్ | | 5 | 0 |
| యక్షప్రశ్నలు-శాస్త్రీయ గ్రంథం-మూడోకూర్పు — బొమ్మలతో | | 2 | 8 |
| ప్రకృతి — గతితర్కం | ఫ్రెడరిక్ ఏంజిల్స్ | 0 | 10 |
| వానరుడు-నరుడు-పరిణామక్రమంలో కర్మపాత్ర | ,, | 0 | 6 |
| ఆచరణ - | మావ్ - త్సే - తుంగ్ | 0 | 6 |
| ప్రజల ప్రజాతంత్ర నియంతృత్వం | ,, | 0 | 8 |
| వైరుధ్యాలు - | ,, | 0 | 12 |
| దక్షిణపవనం - ఎల్మర్ గ్రీన్ - స్టాలిన్ ప్రైజ్ నవల | | 4 | 8 |
| నాడు - నేడు - అడయంలో - నవల - రెండోకూర్పు | | 4 | 0 |
| ప్రతీకార జ్వాలలు - నవల - రెండోకూర్పు | | 1 | 0 |
| నా బాల్యం ( గోర్కీ ఆత్మకథ ) | | 5 | 0 |
| విజ్ఞాని పావ్లోవ్ - మహావిజ్ఞాని జీవితం | | 2 | 8 |
| గోర్కీ జీవితం - రెండోకూర్పు - బొమ్మలతో | | 2 | 0 |
| టాల్‌స్టాయ్ జీవితం - రెండోకూర్పు - రామమోహన్ | | 1 | 0 |
| ఛాయ - పది నాటికలు - శ్రీ ముద్దా విశ్వనాథం | | 2 | 0 |
| లెనిన్ జీవిత కథలు - మూడోకూర్పు - బొమ్మలతో | | 1 | 0 |
| కారల్ మార్క్స్ ఉపదేశాలు - | లెనిన్ - రెండోకూర్పు | 1 | 0 |
| రాజ్యాంగ యంత్రం | ,, నాల్గవ కూర్పు | 0 | 4 |
| రష్యా విప్లవం - 1905 | రెండోకూర్పు | 1 | 4 |
| వామపక్ష కమ్యూనిజం - బాల్యారిష్టం ,, | | 2 | 0 |
| ప్రపంచ కార్మికోద్యమ చరిత్ర - రెండోకూర్పు | | 1 | 4 |
| చెకోవ్ కథలు - 13 కథలు - 238 పుటలు | | 2 | 0 |
| టాల్‌స్టాయ్ కథలు - పది కథలు - మూడవకూర్పు | | 2 | 0 |
| మపాసా కథలు - 19 కథలు-240 పుటలు | | 2 | 0 |

| | | |
|---|---|---|
| గోర్కీ కథలు - ఆరు కథలు - 160 పుటలు | 1 | 8 |
| నాద్యా- వివిధ దేశాల కథలు- చక్కనివి | 1 | 0 |
| చీనా కథలు - ఆస్వాల్డ్ ఎర్డ్బర్గ్ - 2 వ కూరుపు | 1 | 0 |
| డిప్యూటీ చైర్మెన్ - చీనావిప్లవ కథలు | 1 | 0 |
| ఆంధ్రుల చరిత్ర - ఖండవల్లి బాలేందుశేఖరం, ఎం. ఏ, | 1 | 8 |
| యూదుల చరిత్ర - ,, | 1 | 8 |
| విప్లవ సందేశం - నాలుగో కూర్పు | 0 | 8 |
| బలిదాన్ - లియోనిద్ లియోనీవ్ - నాటకం | 1 | 0 |

## అవంతీ ప్రచురణలు, రాజమండ్రి వారి

రథచక్రాలు — రాజకీయ నవల

రచన:- రామమోహన్. 504 పుటలు క్రౌన్ సైజు 3-8-0

ఓనమాలు — నవల - రామమోహన్. 2-8-0

శబ్దసింధు — హిందీ - తెలుగు నిఘంటు 1300 పుటలు

కర్త :- సాగి సత్యనారాయణగారు.

డెమ్మీ 1/8 సైజు, గ్లేజు కాగితం, క్యాలికో బైండ్ వెల 12-0-0

## పునర్ముద్రణలో నున్న గ్రంథాలు

బీళ్ళు దున్నేరు — సోవియట్ నవల — 2 వ ముద్రణ.

రచన :- షొలొఖోవ్. అనువాదం:-కృష్ణమోహన్.

సుమారు 600 పుటలు క్రౌన్ 1/8 వెల 6-0-0

ఇండియా — మార్క్స్, ఏంజిల్స్ లేఖలు. ద్వితీయ ముద్రణ.

అనువాదం :- జగన్మోహన్.

అదనపు భోగట్టాతో-పుటలు 150-దేశపటముతో వెల 1-8-0

వ్యవసాయ సామెతలు వెల 1-0-0

సేకరణ :- నేదునూరి గంగాధరంగారు.